గృహలక్ష్మి



# GRIHALAKSHMI

15th DECEMBER 1956

Vol.No.25 No. 12

As 6

# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణి స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము, జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలె యుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1-4-0

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండుటయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3-2-0    6 ఔ॥ రు. 5-8-0

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతుదోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బలహీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0-0

## సౌభాగ్యశొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమను ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందను తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2-0-0

## ప్రమేహాంతకం

### (తెల్లబట్ట వ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతియందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

బుడ్డి రు. 4-0-0

## కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.

ఆంధ్ర ప్రదేశ్‌కు ఏజంట్లు:

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు.

వ్యవస్థాపకులు
డాక్టరు కే. యన్. కేసరి

# గృహలక్ష్మి.

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాసపత్రిక

ప్రొప్రైటరు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౨౮] డిశంబరు 1956 [సంచిక ౧౨

# వి ష య సూ చి క



ముఖచిత్రము :

శ్రీమతి రుక్మిణిదేవి అరుండేలుగారికి రాష్ట్రపతి శ్రీ రాజేంద్రప్రసాద్
'పద్మవిభూషణ్' బిరుదు ప్రదాన సన్నివేశము



## సంస్కృత భాషా కమిషన్ ప్రశ్నావళి

ఈ మధ్య భారత ప్రభుత్వము మన దేశంలోని ప్రస్తుత సంస్కృత విద్యా విధానమును పరిశీలించుటకు గాను ఒక కమీషన్‌ను నియమించింది.

సంస్కృత విద్యా కమిషన్‌వారు యీ సందర్భమున ఒక ప్రశ్నావళిని సంస్కృత, ఇంగ్లీషు భాషలలో చిన్న పుస్తక రూపంలో వెలువరించారు.

మన దేశంలోనేకాక ప్రపంచ మొత్తంలో ప్రాధాన్యత వహించు సంస్కృత విద్యపట్ల ఆసక్తిగల వారు సంస్కృతభాషా కమిషన్ కార్యదర్శి, పూనా 4-కు వ్రాసి తెప్పించుకొని సంస్కృత విద్యావ్యాప్తి నుద్దేశించి మీ అమూల్యమైన సలహాలను సూచనలను వ్రాసి పంపవచ్చును.















అక్టోబరులో ఢిల్లీలో జరిగిన అంతర్విశ్వవిద్యాలయాల విద్యార్థులు జరిపిన వినోదక్రీడలు




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



## అభినందనలు

కుమారి పద్మజనాయుడు పశ్చిమ బెంగాలుకు, శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు కేరళరాష్ట్రమునకు గవర్నరులుగా అధికారము స్వీకరించిన సందర్భమున మేము హృదయ పూర్వకముగా అభినందిస్తున్నాము.

కేంద్ర ప్రభుత్వములో తెలుగు మంత్రులు లేకపోయినా డాక్టరు పట్టాభి సీతారామయ్యగారితో ముగ్గురు ఆంధ్ర ప్రముఖులు రాష్ట్రాధినేతలుగా నుండుట ఆంధ్రులకు గర్వకారణము.

కుమారి పద్మజనాయుడు జాతీయ ఉద్యమంలోనూ, మహిళా ఉద్యమంలోను నాయకురాలుగా వీరోచితంగా పోరాడిన శ్రీమతి సరోజినినాయుడుగారి కుమార్తె. ఉన్నత విద్యావతి, సంఘసేవా రంగములో అపార అనుభవము కలది. ప్రజాజీవితముతో అత్యంత సాన్నిహిత్యముకలది. ఆమె విజ్ఞత, అనుభవము పశ్చిమ బెంగాలు ప్రభుత్వ నిర్వహణకే కాక జాతీయ అభ్యుదయ పురోభివృద్ధులకు సయితం విశేషంగా నుపకరించగలవని ఆశిస్తున్నాము.

ఆంధ్ర రాజకీయవేత్తలలో శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారొకరు. వారి ఆత్మ బలం, విశాల దృక్పథం, అపార అనుభవం కేరళరాష్ట్రపు అభ్యున్నతికి అన్ని రంగాలలో వినియోగపడగలదని రూఢిగా చెప్పవచ్చును.

డాక్టరు పట్టాభి సీతారామయ్య, కుమారి పద్మజనాయుడు, శ్రీ రామకృష్ణరావు గారల సేవానుభవాలు తాత్కాలికంగా స్వరాష్ట్రమునకు దక్కకపోయినా వారు ఎక్కడున్నను స్వరాష్ట్రమును, సోదరాంధ్ర ప్రజలను దృష్టిలో నుంచుకొని అవకాశమున్నప్పుడెల్ల అభివృద్ధి అభ్యుదయాలను ప్రోత్సహించుచుండగలరని మా విశ్వాసము.

# జనాభా పెరుగుదల — ఆహారము

ఈ మధ్య సర్ చార్లెస్ డార్విన్ ఉపన్యసిస్తూ యిప్పటి జనాభా పెరుగుదల సరళి అరికట్టబడకపోయినచో యిప్పటినుండి యాభై సంవత్సరాలకు జనాభా రెట్టింపు కాగలదనియు, దాని నరికట్టడానికి జన్మనిగ్రహమే మార్గమనియు, అందుకుగాను ప్రపంచ విజ్ఞానవేత్తలు కుటుంబ జీవితంలోని స్త్రీ పురుషులలో సాన్నిహిత్యానికి, ప్రేమానురాగాలకు, ఆరోగ్యానికి ముప్పములేని విధంగా జన్మించేవారి సంఖ్య నరికట్టడానికి తమ అపార అనుభవ, శక్తి సామర్థ్యములను వినియోగించి మార్గాలను, విధానాలను రూపొందించవలసి యుంటుందని వివరించారు.

సర్ చార్లెస్ డార్విన్ తన ఉపన్యాసమును అంటు వ్యాధులు, యుద్ధాలు, భూకంపాలు, యితర ప్రమాదాల మూలంగా యాభై సంవత్సరాలలో చనిపోగల జన సంఖ్యను దృష్టిలో నుంచుకొనియే రెట్టింపు జనాభా కాగలదని వెల్లడించియుండాలి. జనాభా పెరుగుదల మాత్రమేకాక తరానికి తరానికి పుట్టుచున్న జనాభా ఆరోగ్య శారీరక స్వాస్థ్యాలలో దిగజారుతున్న విషయము గమనించతగినది.

ఇది యిలాగుండగా యీ నాటి ప్రజల ఆర్థికదుస్థితి దృష్ట్యా యాభై సంవత్సరాలనాటికి జాతీయ రంగంలో ఎంత అభ్యుదయ, అభివృద్ధులు సాధించబడినా, బీళ్లు, యడారులు పంటభూములయి, ఉత్పత్తులు పెరిగినా యీనాటిదానికి రెట్టింపు కానున్న జనాభా ఆర్థికదుస్థితి మరీ విషమం కాగలదని రూఢిగా చెప్పవచ్చును. ఈ పరిస్థితులలో జనాభా పెరుగుదల నరికట్టడం అత్యవసరము.

# శ్రీ శాయిబాబా - భక్తులు

మూలం :
శ్రీ ఎ. వి. శర్మ

అనుసరణ :
శ్రీ సి. సి. పున్నయ్య



భగవద్గీతలో శ్రీ కృష్ణపరమాత్ముడు అర్జునునితో ధర్మము, నీతినియమములు కుంటుబడి అధర్మము, అవినీతి వృద్ధిదశలోనున్నప్పుడు ధర్మమును రక్షించి, దుష్టులను శిక్షించి, ధర్మమును పునస్థాపించుటకు యుగయుగాలలో తాను మానవరూపంలో జన్మిస్తుండెదనని వ్యక్తముచేసెను.

ఈ మాటలయదార్థమును ననుసరించి భగవంతుడు పలుమారులు భూమిమీద శ్రీరామ, కృష్ణ, బుద్ధ, రామకృష్ణపరమహంస యిత్యాది అవతార పురుషులుగా దుష్టులను నాశనంచేసి అమాయకులను, పీడితులను రక్షించి శుద్ధమైనచింత, నడతలను సామాన్యప్రజలలో అలవరచుటకు అవతరించాడు. మానవులకు సహాయము చేయుటకు, మాయకులోబడిన అనాత్మవాద ఫలితముగా ఏర్పడిన బాధలు, కష్టములనుండి విముక్తిని ప్రసాదించుటకు మహర్షులు, దివ్యపురుషులు ఎప్పటికప్పుడు ప్రపంచములో వివిధ ప్రాంతాలలో దేవదూతలుగా, దివ్యజ్యోతిని వెలిగించి పీడితప్రజలలో ఆత్మవిశ్వాసమును, పారమార్థికచింతను పూరిస్తూ వస్తున్నారు. ఇది మనభారత పుణ్యభూమిలో సహజ సంభవము.

షిర్డీపురీశ శ్రీ శాయిబాబా అట్టి దివ్యపురుషులు, దేవదూతల శ్రేణిలోనొకరు. గతశతాబ్ద మధ్యకాలంలో బొంబాయి రాష్ట్రంలోని అహమ్మదు నగర్ జిల్లాలో నివసించాడు. శ్రీబాబా జననమును గురించికాని, తల్లిదండ్రులనుగురించికాని ఎవరికీ ఏమి తెలియదు. చిన్నతనంలోనే తనదివ్య సందేశమును పూరించుటకు అనువగు ప్రశాంత ప్రదేశము నన్వేషిస్తూ ఒక ప్రదేశమునుండి మరొక ప్రదేశమునకు తిరుగ సాగాడు. ఒకరోజున హఠాత్తుగా ఆయనకు 16 సంవత్సరాల వయస్సప్పుడు అహమ్మద్‌నగర్ జిల్లాలోని కుగ్రామమైన షిర్డిలో ప్రత్యక్షమయ్యెను. అక్కడి అనుకూలవాతావరణము తన పారమార్థిక కృషికి అనువైనదిగానుండుటచే దానినే తననివాసస్థానముగా నెన్నుకొనెను. మొట్టమొదట ఏర్పరచుకున్న వేపచెట్టుక్రింది నివాసమునుండి చివరకు సమీపముననున్న ఒక చిన్న మసీదుకు తన నివాసమును మార్చుకొనెను. అక్కడ ఆయన చేయుచున్న సాధనలగురించి కాని, ఆయన పుణ్యపురుషుడనిగాని ఎవరును యూహించలేకపోయిరి. కాని ఒక నాడు నూనెలేకపోయేసరికి దీపజ్యోతులను నీళ్లుపోసి వెలిగించిరాత్రంతా వెలుగునట్లు చేయుగానే ప్రజలలో ఆశ్చర్యము, భక్తిశ్రద్ధలు సహజంగానేర్పడెను. తన స్వాంత ఔషధములతో రోగులకు చికిత్సచేసి సంపూర్ణమైన తృప్తిని కలిగించి ప్రజలనాశ్చర్య పరచగలిగెను. తర్వాత కొంతకాలమునకు ఔషధమునకు బదులుగా తన నివాసములోని అగ్నినుండి తీసిన బూడిద నుపయోగించి త్వరితగతిన రోగులను స్వస్థపరచుటయేగాక సామాన్యప్రజల దుఃఖములను, బాధలను పారద్రోలి ఉపశమనాన్ని, సంతోషమును సమకూర్చడంతో శ్రీ బాబా గుంపులు గుంపులుగా ప్రజల నాకర్షింపసాగెను. ఉన్నతోద్యోగులు, జమీందారులు, పెద్దసిమితపరులుసయితము శ్రీ బాబా దర్శనమునకురాసాగారు. ఈవిధంగా కుగ్రామమైన షిర్డి క్రమంగా పుణ్యక్షేత్రంగామారింది. ఒక ఫకీరుగా నున్న శ్రీ శాయిబాబాకు ధనవస్తురూపంలో రాజోపచారములు, విశేష ఆదాయవసతులు సమకూరినను ఆయన పూర్వపుజీవయాత్రలో మాత్రము మార్పేమికనుపించిందికాదు. ఎప్పటి వినయంతో, నిరాడంబరుడుగా పవిత్రమైన బీద

సాధువుగానే తన సేవాధర్మమును నిర్వహించుచు మహర్షిగా, దివ్యపురుషుడుగా కోరిన వారికి సహాయపడుతూ ప్రకాశించెను.

శ్రీ శాయిబాబా ఏపాఠశాలలో విద్యనభ్యసించినవాడు కాడగుటచే చదువను వ్రాయను తెలియకపోయినా ఇహలోక విషయములనుగురించి, వేదవిజ్ఞానమును గురించి, ప్రాచీనాధునిక ఆచారములు, కాలేజి పాఠశాలల విద్యలనుగురించి విచిత్రమైన విజ్ఞానమును ప్రదర్శించేవాడు. సులభంగా ఆ విషయాలనుగురించి పెక్కుమంది విజ్ఞానవేత్తలతోటి మతవేదాంత సమస్యలను చర్చించి అనేకసందేహములను తీర్చకలిగేవాడు.

పవిత్రసేవా ధర్మముగా రూపొందిన శ్రీ శాయిబాబా జీవితము కలిమిలేముల, స్త్రీ పురుషుల, చిన్న పెద్ద, బాలబాలికల తారతమ్యముల కతీత రహితమయినది. తనదగ్గరకు వచ్చిన వారందరిని ప్రేమాభిమానములతో కుల, వర్గభేదరహితంగా సమానంగా చూచేవాడు. షుమారు యాభైసంవత్సరముల కాలం తన దివ్యశక్తితో పీడితమానవుల కష్టములను, బాధలను నివృత్తిచేసి ప్రాపంచక విషయాలలో సహాయపడినా ఆయన దృష్టి ఎల్లప్పుడు ప్రజలలో పారమార్థికచింతను, భగవంతుని పట్ల భక్తి విశ్వాసములను, పవిత్రభావమును పెంపొందజేయుచు ముక్తిసాధనను ప్రోత్సహించేవాడు. శ్రీబాబా దివ్యసందేశము ప్రేమ, పరస్పరసద్భావ, సాన్నిహిత్యములను, ఓర్పును ఉద్దేశించునది. ఆయన తన సందేశమును సులభపద్ధతిలో దైనిక సంఘటనల ఉదాహరణముతో పూరించేవాడు. అన్ని మతములు ఒక్కటేననే రహస్యమును బోధించి ప్రపంచశాంతికి, ప్రజలలో తృప్తి, సమరససమైక్యతలకు మార్గదర్శి అయ్యెను. అన్నివర్గములనుండి స్వీకరించిన తనభక్తులలో విశ్వాసమును పూరించుటకు అనేక అద్భుతములను ప్రదర్శించేవాడు. ప్రకృతిసిద్ధమయినవర్షము, గాలిని సులభంగా అదుపులోనుంచకలిగాడు. శ్రీ బాబా తన దివ్యదృష్టితో తన భక్తులకు రానున్న కష్టములనుండి, ఆపదలనుండి కాపాడి 'భగవంతుని పట్ల విశ్వాసము, బాబా పట్లవిశ్వాసము, తన గురువుపట్ల విశ్వాసము సంపూర్ణ విశ్వాసముతో ఆత్మార్పణము చేయుటయే, అని నిరూపించాడు. భక్తులపట్ల శ్రీ బాబాకుగల అశేషప్రేమాభిమానములు పేర్కొనుటకు యీక్రింది ఆయనదివ్యవాక్కులు ఉదాహరణములు:

"నన్ను ప్రేమించే వారిపై నాదృష్టి ఎల్లప్పుడు ప్రసరించుచుండును. నన్ను ధ్యానించి, స్మరించి, నాలీలనుగానం చేయువారు నాలో ఐక్యమయి కర్మవిముక్తులగుదురు"

'నేను భక్తపరాధీనుడను. నేను నా భక్తుల సేవకుడను. నాకు భక్తి ఉపాసనలంటే చాలప్రీతి. నాకు రూపంలేదు - సర్వవ్యాపినికాబట్టి నేనిక్కడుండగా మీ కెందుకింక భయము?'

'నా మాటలపట్ల విశ్వాసముంచండి! దానివలన మీ ఉద్దేశలక్ష్యాలు సిద్ధించగలవు. నన్ను శరణుజొచ్చిన వారివెంట నా సమాధికదలుచు మాట్లాడుచుండును'

'నా అనుగ్రహమునుకోరండి! కోరి పొందండి! నా ద్వారమును తట్టినచో అది తెరవబడుతుంది!'

ఆయన సమాధి నొందిన తరువాత సయితము అనేకమంది భక్తులు అశేషసంఖ్యలో ఆయన స్వర్ణపాదముల చెంత బ్రతికియున్నప్పటిలాగనే తృప్తి కొరకు, ఆనందము కొరకు, మనశ్శాంతి కొరకు శ్రీబాబా నేర్పిన సర్వతోముఖమైన ప్రేమ, భక్తి ఉపాసనల సాధనతో నిరాకారరూపంగా శాయిబాబా జీవించియున్నాడని నమ్మికుదురుకొనుచున్నారు.

1918లో శ్రీ శాయిబాబా సమాధినొందునపుడు తన భక్తులలోనుండి పట్టుదలగలవారి నెన్నుకొని వారు తనమార్గాలలో దివ్య సందేశమును దేశము మొత్తంమీద వ్యాప్తి చేయగలరని ఉద్దేశించాడు. అప్పటినుండి ఆయన భక్తులు ఉత్తర,దక్షిణాపథాలలో శ్రీశాయిబాబా ఆరాధనాకేంద్రాలను స్థాపించారు. అందులో మద్రాసు నందలి అఖిలభారత శాయి సమాజపు ఆలయము ఒకటి. ఇది శాయిభక్తుడు శ్రీ నరసింహస్వామిగారి నిర్విరామకృషి ఫలితంగా నిర్మించబడినది.

## స్వామి కేశవయ్యగారు

పేర్కొనదగిన శ్రీ శాయి భక్తులలో మద్రాసు నందలి షెణాయ్ నగర్‌లో మహిమాన్వితమైన శ్రీ బాబా సేవా ధర్మమును నిర్వహించుచు ఆ శేవ భక్తకోటికి ఆత్మ విశ్వాసమును, శారీరిక స్వస్థతను, మానసిక శాంతిని ప్రతి గురువారం తాను ఆరాధించు శ్రీశాయిబాబా చిత్రపటమును దర్శించుటకు వచ్చు వారికి సమకూర్చుచున్న శ్రీ కేశవయ్యగారొకరు. దక్షిణ దేశంలో శ్రీ బాబా బోధనలను, సందేశమును వ్యాప్తి నొందించుటకు శ్రీ కేశవయ్యగారొక సాధన భూతుడైనాడు. ఆయనతో పరిచయమున్న వారు, దర్శించువారు అనన్యమైన భక్తి విశ్వాసములను వెల్లడిస్తుంటారు. శ్రీ కేశవయ్యగారి శ్రీ బాబా పట్ల భక్తి, ఆత్మ నివేదనము అమోఘమైనదియై ఆయన అనుచరులకు ఆదర్శనీయములైనవి.

శ్రీ కేశవయ్యగారు 1941-48.లో అనంతపురం జిల్లా పెనుగొండలో సబ్‌రిజిస్ట్రారుగానుంటూ ప్రతి గురువారం చేయుచున్న శ్రీ శాయిబాబా ఆరాధన, పూజలను గురించి కాలక్రమేణా ప్రజలకు తెలియవచ్చింది. క్రమంగా భక్తులు కొంతకాలమునకు వందల సంఖ్యలో పూజారాధనలలో పాల్గొని శ్రీ శాయి బాబా అనుగ్రహమునకు పాత్రులగుటకు గుమికూడ సాగారు. అందులో కొందరు తమ ఇహలోక బాధలు, కష్టాలనుండి స్వస్థతకోరువారు, మరి కొందరు మనశ్శాంతిని, ఉద్యోగ ఆర్థిక చిక్కుల నుండి విముక్తి కోరువారు ఉంటుండేవారు. అలా వచ్చి కోరినవారికి శ్రీ కేశవయ్యగారి సలహాలు, సంపూర్ణమైన తృప్తిని కలిగించేవి. మొట్ట మొదట శ్రీ కేశవయ్యగారు భక్తులను తన స్వగృహముననే స్వీకరించేవాడు. కాని భక్తుల సంఖ్య పెరిగినకొలది స్థలాభావం ఏర్పడి శ్రీ బాబా ఆరాధనా పూజలకు ఒక చిన్న ఆలయనిర్మాణము అవసరమనిపించింది. భక్తుల శక్త్యానుసారం వసూలయిన చందాలు, విరాళములతో ఆలయము నిర్మించబడి 1948 మేనెల 23-వ తేదీన మాజీ మద్రాసు మంత్రి శ్రీ హెచ్. సీతారామరెడ్డిగారిచే తెరువబడింది. శ్రీ కేశవయ్యగారికృషి అనంతపురం జిల్లాలో శ్రీ శాయిబాబా బోధనలవ్యాప్తి కనువుగా శ్రీ శాయిబాబా ఆలయము ప్రజల ఆరాధన, పూజలకు శాశ్వతమైన అవకాశములను కల్పించి పెట్టినది.

తర్వాత శ్రీ శాయిబాబా శ్రీ కేశవయ్యగారిని దక్షిణాపథంలో ప్రజల సేవకు ఆదేశించాడా అనునట్లు ఉద్యోగం బదిలీకావడంతో మద్రాసులో అప్పుడే నూతనంగా ఏర్పడుతున్న షెణాయి నగరంలో నివాసమేర్పరచుకున్నారు. ఆయన రాకను గురించి, శ్రీ బాబా ఆరాధనను గురించి క్రమంగా తెలిసికొనిన ప్రజలు గుంపులు గుంపులుగా వందల సంఖ్యలో పెరిగి రాసాగారు.

(సశేషం)

—o—

# డాక్టరు రాధాకృష్ణన్‌కు సతీ వియోగం

మన ఉప రాష్ట్రపతి డాక్టరు రాధాకృష్ణన్‌గారి సతీమణి శ్రీమతి శివకామమ్మగారు (వయస్సు 64 సం||) నవంబరు 26–వ తేదీ సోమవారంనాడు మైలాపూరు (మద్రాసు)లో తమ స్వగృహమున దివంగతులైరన్న విషాదవార్త వినవచ్చినది. నెలరోజుల క్రితం వీరికి హఠాత్తుగా హృద్రోగమువలన ప్రమాదస్థితి సంభవించినప్పుడు, జపానులో నుండిన డాక్టరు రాధాకృష్ణన్ తమ పర్యటనను విరమించుకొని గృహోన్ముఖులు కావలసివచ్చింది. దైవవశాత్తూ అప్పట్లో ఆ గండము గడచి, శివకామమ్మగారు క్రమంగా కోలుకొంటూన్న సందర్భంలో, తిరిగి ఆకస్మికంగా ఇలా ముంచుకొనిరావడం సంభవించినది.



భర్త జన్మదినోత్సవమునాడు కీ|| శే|| శివకామమ్మగారు

డాక్టరు రాధాకృష్ణన్‌గారు చివరి సమయంలో దగ్గర లేరు. ఢిల్లీలో తిరిగి పెద్దయెత్తున సంకల్పించబడిన బుద్ధజయంతి మహోత్సవాలకు ఆధ్వర్యం వహించి యేర్పాట్లు చేయిస్తున్నారు. టిబెట్టునుంచి దలైలామా, పంచన్‌లామాలు, సిక్కిం నుండి సిక్కిం మహారాజు సపరివారంగా ఈ ఉత్సవాలకువిచ్చేశారు. ఇంకా, దేశ దేశాల పెద్దలను కొందరిని భారతప్రభుత్వం ఈ ఉత్సవాలకు ఆహ్వానించింది. కాని, దురదృష్టవశాత్తూ, డాక్టర్ రాధాకృష్ణన్ ఈ ఉత్సవాలకు సంబంధించిన గోష్ఠికి అధ్యక్షత

వహింప వీలులేకపోయింది. భార్య మరణ వార్త విని, వెంటనే మద్రాసుకు విమానంలో వెడలిపోయారు.

స్వర్గీయులు శివకామమ్మగారికి ఒక కుమారుడు, అయిదుగురు కుమార్తెలు. కుమారుడు డాక్టర్ గోపాల్ భారత ప్రభుత్వపు విదేశాంగ మంత్రిత్వశాఖలో హిస్టారికల్ రికార్డ్సు డైరెక్టరు. మద్రాసు డిప్యూటీ అకౌంటెంటు జనరల్ శ్రీ డి. రామచంద్రరావుగారు, ఆంధ్రప్రదేశ్ మెడికల్ సర్వీసెస్ డైరెక్టరు మేజర్ కే. యన్. రావు, స్టేట్ ట్రేడింగు కార్పొరేషను మేనేజింగు డైరెక్టరు శ్రీ డి. శాండిల్య, అడ్వొకేటు కే. శేషగిరిరావు, ఆంధ్ర గవర్నమెంటు ప్లీడరు శ్రీ యం. శేషాచలపతి — ఈ అయిదుగురూ వీరి అల్లుళ్లు. ధన్యజీవియగు శివకామమ్మగారికి పరమేశ్వరుడు ఉత్తమగతులు కల్పించుగాక!



ఇండియా వైస్‌ప్రెసిడెంటు డా॥ యస్. రాధకృష్ణన్‌గారు తూర్పు ఆశియా దేశాల సౌహార్ద పర్యటన సందర్భమున టోకియోలో జపాను చక్రవర్తి దంపతులతో ముచ్చటిస్తున్న చిత్రము

# బిడ్డలు - తల్లిదండ్రులు

## క్రీడ

శ్రీ కె. వెంకట్రామయ్య

### క్రీడయననేమి?

క్రీడయననేమో సరిగా జెప్పుట మిక్కిలి కష్టము. ఐనను మన మెప్పుడు క్రీడించునదియును ఇతరులెప్పుడు క్రీడించునదియును మనకు తెలియుచునే యుండును. క్రీడ యెన్నో విధములై యుండగలదు. పిన్న పెద్దలలో నెవరిదైనను కాగలదు. అది యెట్టిదైనను, యెవరిదైనను దానికేదైన నొక సామాన్య లక్షణ మున్నదేమో యాలోచింతము.

క్రీడ యనునది ముఖ్యముగా మనకొక కార్యము నెడగల యభిప్రాయమేయగును. ఎవరైనను యెట్టి నిర్బంధమును లేక తమ కానందము నిచ్చెడి ఒక కార్యమును జేయుచుండిరేని వారు క్రీడించుచున్నారని మన మందుము. ప్రతి దినమును 10 నుండి 11 గంటల వరకును "తల్లి" యాటనాడుమని యొక బాలిక నాజ్ఞాపించితిమనుకొనుడు. లేదా మధ్యాహ్నము 2 గంటల నుండి 3 గంటల వరకును "గొల్ల" యాటాడుమని యొక బాలునకు జెప్పితిమనుకొనుడు. అప్పుడా యాటలు వారికి క్రీడ యెట్లగును? ఆటయం దిష్టములేని వ్యక్తిని ఏ బంతియాటనో కులాసాగా నాడుమని వైద్యుడు నిర్బంధించిన అది యాతని కాటయగునా? నిర్బంధితమగు నేకార్యమైనను పని యగునేగాని క్రీడ కాజాలదు. క్రీడ ఒక విధమగు నాత్మ ప్రకటన వ్యాపారము. (A form of self-expression) క్రీడయందెట్టి నిర్బంధము నుండరాదు. నిర్బంధమువలన క్రీడా రసము నశించును.

### బాల్య క్రీడకుగల విలువ (The value of Child's Play)

క్రీడించుట బాల్యమునకు సర్వ సామాన్యమగు **సహజ లక్షణము. బిడ్డలేజాతివారైనను, ఏకాలము** వారైనను, ప్రపంచమున నెచ్చట నివసించువారైనను, క్రీడాసక్తిని జూపుచునే యుందురు. దీనిని బట్టిజూడ క్రీడ బిడ్డలకొక ముఖ్యావసరమని తోచక తప్పదు. ఒక విధముగ జెప్పవలసిన క్రీడించుటయే బాల్య మనదగును. క్రీడింపని బిడ్డలు బాలోత్సాహమును జూపజాలరు. తగిన సహవాసములేకయో, అనారోగ్యము, బీదతనమువలననో తమ్ములను చెల్లెండ్రను జూచుకొనెడి బాధ్యత పైబడియో ఆడుకొనుట కంతగా నవకాశములేని బిడ్డల గమనించినవారు వయసునకు పిన్నలయ్యును, ఉత్సాహములేక పెద్దవారిగ నగుపడుచుందురు. అట్టి బిడ్డలు బాల్యమున క్రీడించుటచే బొందదగు నభివృద్ధిని గోల్పోయిన వారగుదురు. బాల్యము గడచిన పిదప దానిని వారిక బొందజాలరు. కావున బిడ్డలు సహజోత్సాహముతో సంతోషముగానుండి సక్రమాభివృద్ధి నొందుటకు క్రీడ వారికెంతయు ముఖ్యము.

8, 9, యేండ్ల వయస్సు వచ్చు వరకును, బిడ్డలకు భాషాజ్ఞాన మంతగా నలవడదు. అందుచేవారు తమ యుద్దేశములను, మనోభావములను, మాటలలో జెప్పుకొనుట కెంతయు కష్టపడుదురు. అట్టియెడ వారికి క్రీడయే మనోభావములను వ్యక్తపరచుకొనుట కొక ముఖ్య సాధనమగును. బిడ్డల క్రీడ వారు వ్యక్తము జేయగోరెడి భావములను బట్టియు, భావోద్రేకములనుబట్టియు వేరగుచుండును.

క్రీడవలన బిడ్డలు సంపూర్ణదేహాభివృద్ధిని ఎంతో సంతృప్తికరముగ బొందగలరు. ఉత్సాహముతో బయటనాడునపుడు వారి శరీరాంగముల కన్నిటికిని మంచి యభ్యాసము గలుగును. సరిగా శ్వాసించుటచే గుండెయు నూపిరి తిత్తులును ఆరోగ్యస్థితియం

(665-వ పేజీ చూడుడు)

క థా ని క

# ప్రేమ బంధం

శ్రీమతి మునిపల్లె సరస్వతి

గవర్నమెంటు స్కూల్లో యస్. యస్. ఎల్. సి. పాసయిన నేనూ, మా ప్రభాకరం గుంటూరు కాలేజీలో చేరాము. చిన్ననాటినుండి పల్లెటూరి వాతావరణములో మెలగిన మాకు బస్తీ అంటే అదో కుతూహలముగా నుండేది. తిరగడమనేది మా యిరువురకు సరదాగానే వుండేది. చదువులో ఒకరి నొకరము తీసిపోయేవాళ్లముగాదు. చిన్ననాటినుండి ఒక మంచాన పరుండి, ఒక కంచాన తిని చివరకు పెద్దయ్యాక యిరువురం వియ్యమందుదామనుకున్నాము గూడా చివరకు. మా వూరి పంతులు మాటద్వారా మా నాన్న నన్ను కాలేజీకి పెట్టాడు. ప్రభాకరం తండ్రి గతించిపోయాడు. వున్న మూడెకరాలు పండింపజేసుకుంటూ, వాళ్లమ్మ వంటిమీది నగలమ్మి కాతో వాణ్ణి చదువుకు పంపింది. క్రొత్తలో కాలేజీకి వెళ్ళాలంటే చాల భయంగా నుండేది. కాని రానురాను కాలేజీకి ఎప్పుడు వెళ్దామా ... అని అనిపించే రోజులొచ్చాయి. ఇది అందరబ్బాయిలకు అనిపిస్తూనే వుంటుందనుకుంటా!

కాలేజీకి శలవురాగానే ప్రభాకరం, నేనూ బయల్దేరేవాళ్లం. ఎక్కడైనా ఆడపిల్ల మా కంటబడితే యమయాతనలుపెట్టి పంపేవాళ్ళం. వెక్కిరింపులు, వేళాకోళాలును. ప్రతి బజారు మాకు పరిచయమైనదనే చెప్పాలి. ఆడపిల్లల్ని గుర్తించడంలో మాదే పెద్దచెయ్యి. ఏ పిల్ల ఏ స్కూల్లో చదివేది రూఢిగా చెప్పగల మేటివాళ్లమయ్యాం. పాపం, ప్రభాకరం నేను చెప్పినట్టు చేసేవాడు. వాడు ఫీజుకట్టలేక అవస్థపడుతూంటే కాస్త నేనే సర్దుబాటు చేస్తూండేవాణ్ణి. అందుచేత వాడు నాకు లోకువయ్యాడు. కాని ఒక్కమాటకూడా వాణ్ణి అని, వాడి మనసు బాధ పెట్టేవాణ్ణిగాదు ... అందుకే మా యిద్దరికి స్నేహం బాగా కుదిరిపోయింది.

ఆ రోజు కాలేజీకి శలవు. ఆదివారం గాబట్టి సినీమాలకు బయల్దేరారంతా ... ఆ రోజు నేను, మా వాడు ప్రభాకర్ టాకీస్‌కు బయల్దేరాం. మా ముస్తాబంతా వ్యర్థమైంది. ఆవరణలో కాలెట్టగానే కాటికాయంత అక్షరాలతో "స్త్రీలకు ప్రత్యేకముగా టిక్కెట్లు యివ్వబడును" అని వ్రాసివుంది. ఆ బోర్డు చూడగానే మా నెత్తిన పిడుగుపడ్డట్టయినది. ఆడవీవనలు వేరయ్యాయనే మా బాధ. ఇదివరకు ఆడవారికి మగవాళ్లకు వొకచోటే టిక్కెట్లు యిచ్చేవాళ్లు. ఏ మహానుభావుడు పుణ్యం గట్టుకున్నాడో... చల్లకువచ్చి ముంత దాచుకున్నట్టుంటుందని తిరిగి వెళ్లకుండా సినీమాచూచి, కాళ్ళీడ్చుకుంటూ కొంపకు జేరాము. లక్ష తిట్టుకున్నామ్. లక్షంటే రెండక్షరాలేగా అనుకుంటారేమో ? .. అలాగాదు. తిట్టాల్సినవన్నీ, వాళ్లంటే ఎంత ఖర్చుపెడ్తూన్నా వాళ్లు తెలియదు సరిగదా బుర్రగూడా పనిచేయదా సమయాల్లో ... ఇప్పుడు నావంటిమీద జెర్రులు బారినట్టుంటే మా వాడికి ఆలీబాబాకథలో దొంగలమీద కిరసనాయిల్ పోసినట్టుంది. సినీమా వదిలాక జై శీతారాం అనుకుంటూ కొంపకు జేరాం. వుదయాన్నే మొఖాలు వ్రేలాడవేసుకొని కాలేజీకి ప్రయాణమయ్యామ్.

2

మా కాలేజీలో "జానకి" అంటే నాకు మహా యిష్టం. జానకి పచ్చని శరీరలావణ్యం, సొట్టబుగ్గల సోయగం, వంకులు తిరిగిన కేశ సౌందర్యం. బ్రహ్మ విలాసానికి సౌందర్యంతో జానకిని సృష్టించాడా... అన్నట్టుంటుంది. చిన్నప్పుడు కొవ్వలివారి జంపన వారి నవలలు చదువుతోంటే నాకేమీ తెలిసేదికాదు, మా వూళ్ళో ప్రేమించుకొని యిరువురు నూతిలోపడి మరణించారు.

వాళ్లు వేరువేరు కులస్థులు. అందుచేత అంతా వాళ్ళను వ్రేలెత్తిచూపి నానామాటలనేవాళ్లు. నేనూ అన్నాను. అబద్ధమెందుకు? నేనూ ఏమిప్రేమలు, తక్కెవాళ్ళులేక ... అనే జాతిలో వుండేవాణ్ణి. మరి నాకు అదే రోగం అంటుకుంది. అన్ని రోగాల్లోకీ యీ ప్రేమ రోగం మహా చెడ్డదనుకుంటా ... దీనికి మందేదైనా వుందో లేదోగాని ... 'జానకీ!' అని ఎవరైనా జానకిని పిలుస్తోంటే నా వొళ్ళు పులకరించి పోయేది. నా వైపు ప్రేమతో వొక్కసారిచూస్తే చాలనుకునే రోజులు. అవి రానురాను నా పాలిటి భాగ్యలక్ష్మి ముందుకు తూలసాగాయి. కాని ఒక్క సంగతి. ఏముంది! అమ్మాయిగారికి నా సంగతి బాగా తెలిసిపోయింది. జానకి ఒక్కోసారి పుస్తకాలు మరచివచ్చేది. కొన్ని తెచ్చినా ... నోట్సులు, అవి యివీ మర్చిపోయివచ్చేది. పాపం, మనసంతా నన్నుగూర్చి పనిచేసేదిగాబోలు. పుస్తకాలు మర్చిపోయిందని, నేనేవచ్చి యిచ్చేవాణ్ణి. క్లాసుకాగానే అంతాచేరి గోలచేసేవాళ్లు. ఎలాగయినా మగవాణ్ణి గనుక, అందులో జానకి నా కిష్టమైనదిగాబట్టి, ఏవో సిగ్గుదొంతరలు నాలో నిండివుండుటచే, ముసిముసి నవ్వులు నవ్వుకునేవాణ్ణి. నా నవ్వులో 'నా జానకీ' మీద ప్రేమ నిండివున్నదనే తెలిసిపోయేది. ప్రతి బజారులో నేనే వుంటానని తెలిసిన జానకి నన్ను చూడగానే కొరకొరలాడేది. కాని ఒక్కగంట సేపటిలోనే చిరచిరలు మటుమాయమయ్యేవి. ఎవరైనావుంటే కోపంతో నిండివుండడము, వీలుగా వుంటే చిరునవ్వుల వలపులతో స్వాగతం యివ్వడము. ఏంటో జానకి మనస్తత్వం నాకేగాదు, నా ఫ్రెండ్ ప్రభాకరానికికూడా, తెలిసేదిదిగాదు. ఆమె ప్రవర్తనను మేమిద్దరం కనిపెట్టలేకపోయామ్.

అప్రయత్నముగా ఒక రోజు, 'జానకీ', జానీ అనే పిలుపులు కాలేజీ ద్వారంలో విన్పించాయి. అక్కడ జానకి మాముందే నడుస్తోంది. వెనుకకు తిరిగి చూశామ్. సరళ, నిమ్మివస్తూ జానకిని పిలుస్తున్నారు. పిలుపువిన్న జానకి పామువలెనున్న జడను ఒక్క వూపుతో ముందుకువచ్చిపడేలా వెనక్కు తిరిగింది. వెంటనే మా ఆకారాలుచూచి చిన్న సంపెంగ రేకుల్లావున్న పెదవులపై చిరునవ్వు ప్రసాదించింది. జానకితో కలుసుకొనవలయునని నిమ్మి, సరళ వడిగా వస్తూ మమ్మల్నిచూసి భయపడ్డారు. సరళ నిమ్మితో అంటోంది. "అడుగో ఆ నూరిగాడు - పట్టి రౌడీ వెధవ. ఆ ప్రక్కనున్న ప్రభాకరాన్ని పాడుచేస్తున్నాడు" అని తన అక్కసంతో వెళ్ళబోసుకుంటోంది. ఆ మాటలు నా చెవినబడ్డాయ్. సమయం వస్తుందిలే అని తలవూపి వూరుకున్నా, అది మా వాడికి కూడా చెప్పాను. కాని మా వాడికి సరళ అంటే ప్రాణం. గాబట్టి ఎక్కువ పట్టించుకోకులే...ఏదో అన్నది అని నన్ను సరిదీశాడు.

## 3

యఫ్. ఎ. రెండవభాగము గనుక మా వాడు, నేను బజార్లకు స్వస్తిచెప్పాము. పరీక్షల సర్దుబాటులో యితర ప్రపంచాన్నే మరచిపోయాము. మాకు భిన్నం గల్గించడానికి సరళ, జానీలు వచ్చేవాళ్ళు. కాని వాళ్లతో సోదిపెట్టుకోకుండా అవతలికి దాటబంపేవాళ్ళమ్. అందుకనివాళ్లు పరీక్షకువెళ్ళేముందు మమ్మల్ని ... "అబ్బో, పూర్ణబ్రహ్మచారులయ్యేరు వీరు" అని వాళ్ళల్లోవారు అనుకుంటూండేవాళ్లు. కాని మేము నవ్వుకునేవాళ్లము. అనుకోని రీతిగా మేమిద్దరం పరీక్షల్లో చక్కగా ఆన్సర్ చేశాము. జానీ చివరరోజు పాపం సరిగా వ్రాయలేదని చెప్పింది. మా వాడు "అయినా గొప్పింటి పిల్లలకు చదువెందుకు" అన్నాడు. ఆ మాటకు జానీ..."రోడ్ల వెంట తిరిగే రౌడీలుంటే మేము చదువుకోక ఏమిచేయమంటావు? ... మరి దిగులుగదూ! ...అంది." ఆ మాట నన్నేనని అనుకున్నా ... మరునాటి సాయంకాలం అల్పాహారవిందు జరిగింది. ఆ రోజు జానకిని చాల గోలచేయ ప్రయత్నించాముగాని ... వీలుపడలే. అందుకు జానకి పైపై సంతోషాన్ని వెలిబుచ్చింది. కాని లోపల్ల పుట్టెడు దిగులు. పాపం, జానకి అవస్థ నేనిప్పటికీ మరచిపోలేదు.

తర్వాత ఫొటో అన్నారు. ఆ సంతోషంమీద వున్నామంతా ఫొటోగ్రాఫర్ రానేవచ్చాడు. మా వాడికి సరళ ప్రక్కన నిలబడాలని వాడికోరిక, నేను జానకి వెనుక నిలబడాలని, చివరకు మా వ్యూహాలన్నీ పటాపంచలయ్యాయి. పొడవుగానున్న నన్ను సరళ వెనుకకు పంపాడు ఫొటోగ్రాఫర్, ప్రభాకరాన్ని జానకి ప్రక్కగా నిలబెట్టాడు. నిజంగా నాకంటి వెంట నీరు గిర్రున తిరిగిందనుకున్నా ... వాణ్ణి బయటకురానిచ్చి తన్నాలనుకున్నా ... వెధవపీనుగ అని ఎన్నెన్నోతిట్టా ... జానకి నా వైపు ఎన్నోసార్లు చూసింది. కాని ఏమిలాభం? గుటకలుమ్రింగి వూరుకున్నాము నేనూ మా వాడు. మంచి పరిచయముండుటచే సరళ, జానీ వాళ్లు కలసి మాతో సినీమాకు బయల్దేరారు. ఇదో గోల యీ సినీమావాళ్లు ప్రత్యేకస్థల నిర్ణయాలు చేశారుగదా ... ఏదో గడచిపోయింది. ఎవరికొంపలకువాళ్ళుజేరారు.

మరునాడే మా ప్రయాణం. మళ్ళీ పల్లెటూరిగోల. కాలికి బలపంగట్టుకొని తిరిగే నాకు యీ పల్లెటూరు యమలోకంగా గన్పడేది. ఒక్క కాలేజీపిల్లగూడా గన్పడేదిగాదు. ఎవరైనా కన్పించిన తుర్రున యిండ్లలోకి దూరేవాళ్లు. సినీమాపాటలు పాడనేపాడరు. డ్యాన్సులు అంతకంటే శూన్యం. ఎదుటకురానివాళ్ళు ఎగరమంటే ఏమెగురుతారువాళ్లు, ఇదో ప్రపంచమురా నాయనా ... మళ్ళీ కాలేజీ ఎప్పుడు తెరుస్తారోనని రోజూ వ్రేళ్లు లెక్కవేసుకోడంతో రిజల్ట్సు గూడా తెలిసిపోయాయి. అదృష్టంవలన నేనూ ప్రభాకరం పాసయ్యాము. జానీ పూర్తిగా తప్పింది. సరళ ఒక్కపార్ట్ అయింది. ... మా యింట్లో కలకలము బయల్దేరింది. నా పరీక్షా ఫలితం విన్న నాన్న పెళ్ళిచేయాలని సంకల్పించాడు. ఈ మాటవిన్న నా శరీరం చెమటబిందువుల్తో నిండిపోయింది. మంచంలోని నాయనమ్మ నన్నొక యింటివాణ్ణిచేస్తే చూస్తుందట. 'పిల్లికి చెల్గాటం, ఎలుకకు ప్రాణసంకటంలా వుంది.' ఈ విధంగా బజార్లలో తిరిగే నాకు బంధం పడితే ... అమ్మ బాబో, ఇక ఆవిడ తిరగనిస్తుందా? చీపిరికట్ట తిరగవేయదూ! నా వొళ్లు వణకినట్లయింది. మధ్యరకంలో నలిగిచస్తోన్న కుటుంబాలెన్ని వున్నాయో అన్నీ నా కండ్లముందు గోచరించినట్లయింది. ఆ దిగుల్తోనే ఏజవాబు చెప్పకుండా కాలేజీకి దారితీశాను. మా వాడూ తోడయ్యాడు. బాబూ ... బ్రతికి బయటపడ్డానురా ... నన్నా



నవంబరు ఒకటవ తేదీన పశ్చిమ బెంగాలు గవర్నరుగా అధికార స్వీకారంచేసిన కుమారి పద్మజ నాయుడు

మా వాడితో. 'ఏం'టన్నాడు. ఈ కథంతా చెప్పేక ఫక్కున నవ్వాడు.

4

జానకి లేని లోటు రోజురోజుకు మరింత బాధనిపించింది. నాకేగాదు. సరళ లేకపోవడంతో మా వాడికి ప్రాణం వునూరుమంటోంది. దానికి తోడు లెసన్సు మరీ ఎక్కువయ్యాయి. ఆరోజు గాంధీ

జయంతి. గనుక మా కాలేజీకి శలవుయిచ్చారు. మా వాడు ఎందుకో 'స్టేషన్‌కు పోదామురా!' అన్నాడు. తలనొప్పితో బాధపడుతున్న నేను 'రాలేనురా' అన్నా... కాని వాడు నామాట వినకుండా "వస్తావా? రావా?" అని పట్టు పట్టాడు. చివరకు వప్పుకొని యిద్దరం స్టేషన్‌కు పోయామ్. మాకు పరిచయమైన వాళ్ళు చాలమంది కనబడి "ఏమిరోయ్ ... యీ రోజు ఏదో ఎత్తు వేశారే" అని అనడము మొదలెట్టారు. బండి గుడివాడ పోవడానికి నిల్చివుంది. మా యిద్దరిదీ చెరో త్రోవయింది. ప్రతికంపార్ట్‌మెంటు గాలించామ్. నాకు పది అడుగుల దూరంలో ప్రభాకరం యీల వేసి పిలిచాడు. నాలుగడుగుల్లో వాణ్ణికలుసుకున్నా... బండి సాగింది రాక్షసిబొగ్గు పొగతో... నేను వురవడిమీద తలుపు నానుచేసుకొని కిటికీని గట్టిగా పట్టుకున్నా...ప్రభాకరం లోపలున్నాడు. ఎలాగో కష్టపడి సిగరెట్ వెలిగించి రైలు పొగతో, నా పొగను లీనంచేశాను. సిగరెట్ పొగ వలయాలు చుట్టు రైలు పెట్టెలోకికూడా దూసుకుపోతోంది. ఇంతలో కమ్మని కంఠం వినిపించింది. అలాకిటికీలో గుండా తొంగిచూశా......"జానకిని కూడా మరపించే పిల్ల" ఎక్కడలేని ఆనందం పెల్లుబికింది. "ఏయ్! బుద్ధిలేదూ? ఏంటీ ఆ పొగ, నువ్వూనూ;" ...అంది. నాకు కోపంరాలేదు. కిటికీలోకి తలపోనిచ్చి... "అబ్బో ... మీరు-మీ స్నోకం పూ ...బుద్ధిలేదూ..." అన్నాను. ఆ అమ్మాయి ముఖంలో కోపమే కోశానా కన్పించలేదు. ఆ పిల్ల ప్రక్కనున్న అమ్మాయికి మాయిద్దరి తంతూ తెలిసిపోయింది. నేను ప్రభాకరం వొక్కటేనని... ఆమె యీ పిల్ల అక్కయివుంటుందని గ్రహించా... ఆమె చేతిలో ఆంధ్ర ప్రభ వుంది. ప్రభాకరం తలుపు తీశాడు. నేనూ మెల్లగా లోపలకు ప్రవేశించా. పుస్తకమడగరా అని వాడిచెవిలో వూదా...వాడు నిజంగానే ఆమెను పుస్తకమడిగాడు. ఆమె ముఖం కోపంతో కందగడ్డలావుంది. దానికితోడు వీడి మాటలకి ఆమె మండిపోయింది. లేనివ్వనంది. ఆకంపార్ట్‌మెంట్‌లోని వాళ్లుకు మా ప్రసక్తి పట లేదనుకుంటూ. అంతా భగవద్గీత విషయాలు, వాళ్ళ కోడళ్ళ ప్రతాపాలు చెప్పుకుంటున్నారే గాని మా విషయం...మర్చిపోయారంతా. వాళ్ళను గురించి ఏవో చెప్పుకుంటున్నా మనుకున్నారు యిద్దరక్కచెల్లెళ్ళూ...వుండండి ప్రక్కస్టేషన్ వచ్చాక...అని చెల్లి అంటూంటే కాదుకాదు గొలుసులాగి రిపోర్ట్ చేస్తా నంటుంది అక్క. ఇదంతా విన్న నేను వూరకుండలేకపోయా. 'అమ్మాయ్! గొలుసులాగితే మీ దగ్గర 50/ రూ తకీమని పుచ్చుకుంటారన్నాను. ఆ మాట విన్న పెద్దామెకు కళ్ళు ఎఱ్ఱబారాయి. 'ఈ కాలేజీకుఱ్ఱవాళ్ళకు మట్టుమర్యాదలు వుండవు.' అంది. మావాడు. 'అబ్బోతమకండీ!' అన్నాడు. ఆమె 'చ్రనలేచి తమకం, జంకం వుండండి.' అని గొలుసు లాగపోయింది. చెల్లెలువారించగా ఆగడం తప్పింది. అసలు వీళ్ళది ఏవూరో...అనే అనుమానం గల్గింది. పెద్దమ్మాయి కన్నా చిన్నమ్మాయికి మేనులా వెంటపడిరావడం యిష్టంలాగుంది. అక్కకు తెలియకుండా చెల్లెలు టికెట్ చూపింది. దానిమీద 'గుడివాడ'నివుంది. ఇంతలోబండి ప్రక్క స్టేషన్‌కు దూకుడుమీద వచ్చిపడింది. మేమిద్దరం జనంనుండి తప్పుకుంటూ బండి దిగాము. 'వహీదా...చీరిమో!' ...అని అంటూ నవ్వుకుంటూ అటుఇటు పచార్లు చేశాము. మళ్ళీ బండి మాయమయింది. మేమిద్దరం పెద్దమ్మాయి భానుమతనివాడు చిన్నమ్మాయి వహీదా అని నేను వాదించుకుంటూ ... తర్వాత బండికి మొగదులకు జేరామ్.

బి. ఏ పరీక్షలు వాటంతటవే దొర్లుకొని వచ్చాయి. కడుపులో చేతులెట్టి దేవినట్టుంటుంది. దానికితోడు మానాన్నకు, నా పెండ్లి విషయం జరుపుతూ ఏమాట చెప్పడంలేదని గుర్తుకొచ్చాయి. నేనొక వింత ప్రపంచంలో వున్నాననిపించింది. బి. ఏ. పరీక్షులయ్యాక యింటికి వెళ్ళబుద్ధిగాలేదు. నాల్గు రోజులు గుంటూరులోనే గడిపాను. ఇకతప్పదని యింటికి బయల్దేరాము. వాకిట్లో అడుగెట్టగానే మానాన్న 'పెండ్లిమాట' అంటం నాచెవినిపడింది. ఇక నేమి చేయాలో తెలియక తేలవూపాను.

పంచాంగం చూపించారు. మా నాన్న నాకు తెలియకుండానే పెండ్లికూతుర్ని నిశ్చయించినట్టుగా తెలిసిపోయింది. నేనాసమయంలో యజ్ఞ పశువులా తయారయ్యా... మా వాడూ బయల్దేరాడు. మేమంతా నలుగురయిదుగురం ప్రయాణమయ్యాము. రైలెక్కగానే ఏవో పిచ్చిపూహాలు నాలో నాట్యమాడాయి. ఇదివరకు ఎగతాళిచేసిన పిల్లలు ఆ బండిలోనే వున్నట్లనిపించింది. క్రమేణ నాచూపులు బారులు దీరివున్న పొగమబ్బుల్లోకి దూసుకుపోయాయి. ఉదయం 7½ గం గుడివాడలో బండి ఆగింది. ప్రక్క పల్లెటూరికి కాలి మార్గం... నా వొళ్లు మండింది. యీ పెళ్ళి పెత్తనదారులు యిష్టంవచ్చినట్లు చేస్తారు. వినకపోతే చావమంటారు. ఎక్కడలేని వోర్పు వహించి ఓ రచ్చబండ దగ్గరకొచ్చాము. అక్కడే వున్న పిల్ల తండ్రి యింటికి తీసికెళ్ళారు... అప్రయత్నంగా ఓపిల్ల తొంగిచూసింది. ఎవరో ననుకున్నా ...ఆ పిల్లే! రైల్లో మేము చూసినపిల్లే... నాకు ఎక్కడలేని సంతోషం పొంగివచ్చింది. ఇంతకూ మానాన్న మాట్లాడింది పెద్దమ్మాయినట. నా గుండె ఝల్లుమంది.

5

అన్ని ప్రయత్నాలు జరిగినవి. మేళతాళాల శబ్దము మిన్నుముట్టుతున్నది. కాని పెళ్లికొడుకింత సేపటికి పీటలమీద కూర్చోడానికిరాలేదు. పెండ్లికొడుకు ఉనికినిగురించి ఏమూల చూచినా గుసగుసలు బయలుదేరినవి. దాంతోపాటు పెండ్లికూతురు చెల్లెలు కనుపించకపోయేసరికి నలుగురు నానావిధాలుగా మాట్లాడసాగారు. ఉభయపెండ్లివర్గాలవారు ఎవరి మటుకువారు నోరుమెదపక యూరుకున్నారు. పెండ్లి ఆగిపోయింది. కాని నేను, పెళ్ళికూతురు చెల్లెలు ఎక్కడికి పోయింది ఎవరికి తెలియదు. వెనుకముందు ఆలోచించకుండా ఆ నాటి రాత్రి... మాపలాయనం వూళ్లో వుదయాన్నే కల్లోలం గల్గించిందనుకుంటూ ... కాని నా కాద్దినం ప్రపంచమే గోచరించలేదు. నేను మా కనకంతో బొంబాయిలో మెరశాను. ఉద్యోగం కొరకు పట్నమంతా గాలించాను. చివరకు బొంబాయిలో స్టీమర్లమీద తనిఖీదార్ గా నెలకు 300/రూ... ఉద్యోగం దొరికింది. మేమిద్దరం రిజిస్టర్డు పెండ్లిచేసికొనిసంసారం సాగించాం ...బొంబాయి మాకొక స్వర్గంలానిపించింది. సిక్కు



కేరళ రాష్ట్ర ప్రథమ గవర్నరు
శ్రీ బి. రామకృష్ణరావు

స్నేహితుల సాంగత్యమువలన గడ్డం పెంచా... పజిల్సు పూర్తి చేయడం అలవాటయింది. ఇంటిమీద బెంగ గల్గినా మా కనకం పొందువల్ల బెంగ కాస్తా మాయమయ్యేది. కాలచక్రం గిర్రునతిరిగిపోతోంది. నా అదృష్టంవలన క్రాస్‌వర్డ్సులో 24000/–రూ వచ్చాయి. ఆరోజు పత్రికలో నా అడ్రసును వివరించారు పత్రికవారు. మా మామగారికో అలవాటుంది – పత్రిక చదవడం ఏరోజు మానివేయరు. నా అడ్రసు చూచిన మామగారు వస్తారనుకున్నా... ఇల్లు మార్చివేయడమే మంచిదనుకున్నా. యిల్లంతా సరిచేయమని కనకాన్ని పురమాయించాను

ఇంట్లో మాముర‌ళి గోలతో "వద్దులెండి. వచ్చినా ఏమనరు" అని మా ఆవిడ సరిదీసింది. కాదని బండి కొరకు బయల్దేరాబజారుకు. నేననుకున్నంత పనీ జరిగింది. రానేవచ్చారు మా మామగారు. ఆయన చుట్టుతో నా సిగరెట్ పొగగల్సింది. ఆయన్ని చూడగానే నా మొహాన నెత్తురుచుక్క లేదు. నావేషం చూచిన మామామగారు మండిపోతారనుకున్నా... తలకు నల్లనిమఫ్లర్, బాగాపెరిగిన గడ్డం. ఖరీదుగల్గిన పేంట్, ధైర్యం తెచ్చుకొని మామామగార్ని ఆహ్వానించాను.

ఇంటిలోనుండి 'నాన్నా! ... కాఫీ...' అని వస్తున్న మురళిని చూశారు. ఆయన కోపం పటాపంచలైంది. నేను లోపలికి వెళ్ళాను. మాకనకం నాతత్తరపాటును చూచి విస్తుపోయింది. వరండాలో కూర్చొని వున్న మామామగార్ని చూపాను. మా ఆవిడ భయపడుతుందనుకున్నా కాని అదేమీ జరగలేదు. ఇంటివిషయాలు చెప్పాడు. అంతా అయ్యాక, 'కనకం! మీనాన్నగారేమన్నారు' అన్నాను. 'ఆ...ఏమంటారు? మనకు కల్గిన తుపానుకు మన మురళి ఆదుకున్నాడు.' అని ముసి ముసి నవ్వులు నవ్వింది. మామామగారు చివాట్లు పెడతారని భయపడిన నేను ధైర్యంగానే మెలగాను.



నేపాలులో రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్ సౌహార్ద్రపర్యటన సందర్భమున రాజదంపతులతో నున్నప్పటి దృశ్యము

# నిరాశ్రయ

శ్రీమతి ఎమ్. లక్ష్మీదేవి



అది సూర్యోదయం. సూర్యమహారాజు వచ్చుచున్నాడని మందమారుతం ప్రకృతిదేవికి చెప్పింది. ప్రకృతిదేవి సిగ్గువల్ల చెక్కిళ్లెఱ్ఱపడ్డట్లు ప్రాగ్దిశ అరుణవర్ణముతో అలరారుతుంది. త్రుటిలో చిరునవ్వుతో ప్రేయసి వదనారవిందాన్ని ప్రేమపూర్వకముగా తిలకిస్తూ భాస్కరుడు ఆకాశతలాన్ని అధివసించాడు. పక్షులు కిలకిలారావంతో స్వాగతమిచ్చింది. మలయమంద సమీరుడు పూసురటితో సేదదీర విసిరాడు. చెఱువుగట్టున బ్రాహ్మణులు అర్ఘ్యాలు విడుస్తున్నారు. బిచ్చగాళ్ళు ఏదో ఆశతో ఊళ్లోకి నడుస్తున్నారు. ప్రపంచమంతా ప్రాతఃకాలం ప్రసన్నంగానే ఉంది.

కానీ ... ఆ విశాల విశ్వంలో ఒక అభాగిని తన విశాల నేత్రంతో విశాల విశ్వాన్ని విలోకిస్తూంది.

చెఱువుగట్టుననున్న రావిచెట్టు అరుగుమీద కూచుంది. రెండు నిముషాల్లో నలుగురైదుగురు వేపపుల్లలు చేతపట్టుకొని అక్కడికివచ్చి "ఓ అమ్మీ! లే అక్కణ్ణుంచి – దర్జాగావచ్చి కూచున్నావు – నీవు కట్టావా! నీయబ్బ కట్టిపెట్టిండా! లేలే" అని గర్జించాడొకాయన. మౌనంగా వాళ్ల మొహాలకేసిచూసి అక్కణ్ణుంచి లేచి చెఱువుగట్టున కూర్చుంది.

"వారు మాత్రం ఆ అరుగునుకట్టారా! లేక వాళ్లబ్బలుకట్టారా" అని గొణుక్కుంది. వాళ్లైదుగురూ పళ్లుతోముకుంటూ, మధ్య మధ్య నవ్వుతూ లోకాభిరామాయణం మాట్లాడుతున్నారు.

"ఆ అరుగుమీద కూర్చోటానికి వారికి మాత్రం ఏం హక్కుంది?

తన విశాల హస్తాలతో గొడుగులాగ ధనవంతులు ఆదరించకున్నా నిరుపేదలకు నేనాశ్రయమిస్తాను రండని" అంటూ అభయమిస్తూన్న రావిచెట్టునీడనుంచికూడ ఎందుకు తరిమేస్తారీమానవులు? తామేమో ఆశ్రయమియ్యరు! రావిచెట్టుకు గనుక మాట్లాడే శక్తిఉంటే నిరాశ్రయులైన బిచ్చగాళ్ళను గురించి ఎంతజాలి కలిగేట్లుగా వర్ణించేదో గదా" అని అనుకుంది తనలోనే. లేకపోతే ముష్టిదాని కమ్యూనిష్టు ప్రతిపాదనను ఆమోదించేవారెవరు!

ఇంతలో ఇద్దరు బ్రాహ్మణులు స్నానాల

కోసం అక్కడికి వచ్చారు. "ఛీ! ముద రష్టపుదానా! దాపురించావు. రోజు నీ మొహాన మండిపడి చావాలి. మేం స్నానాలు చెయ్యాలి. అలా ఎక్కడి కైనా తగులడి పోగూడదూ" అన్నా డాశాయన ఆమె కేసి ఉరిమిచూస్తూ.

జాలిగాచూస్తూ ఒక్క నిట్టూర్పువుచ్చి అర్ధఫర్లాంగు దూరంలోఉన్న పచ్చగడ్డి మైదానంలో కూలబడింది ఆలోచిస్తూ. ఆమెకు గోచరించింది వేదాంతమే. "ఏం ప్రపంచం? ఇదెవరికి సొంతం? నేనెక్కడా నిల్చోకూడదా? నేనూ మనిషి నేకదా! భగవంతుడు సృష్టించిన భూమిమీద కూడా ఉండగూడదా" అనుకుంది.

"ఏయ్! అమ్మీ! లే, లే, నీకోసం పరిచిన తివాసి అనుకొన్నావా! లేక మెత్తటి పరుపనుకొన్నావా! ఇక్క డొచ్చి కూచున్నావు! ముందు అక్క ణ్ణుంచిలే! మహారాజుల ఆవులు మేయాలి. నువ్వు కూచుంటే అవి మూతికూడ పెట్టవ్, లే, తొందరగా."

తిరిగిచూసింది. ఆవులమేపే కుఱ్ఱవాడు చేతకఱ్ఱపట్టుకొని అధికారభావంతో నిల బడి ఉన్నాడు. "ఆఁ. లేస్తావా! లేదా!" ఒక్కసారి గర్జించాడు. విధిలేదు. ఒక్క సారి విశాల దృష్టితో కలయచూసింది. వాళ్లింకా రావిచెట్టు అరుగుమీదనే కూర్చొని మాట్లాడుతున్నారు. బ్రాహ్మ ణులు స్నానాలు చేస్తూనే ఉన్నారు. చిందరవందరలైన ఊహాలతో తిన్నగా నడుస్తూంది ఊళ్ళోకి.

అంతకు ముందు అడుక్కుంటూన్న బిచ్చగాళ్ళే ఇంటి వాళ్ళచేత తిట్లుతిని వట్టి చేతులతో ఎదురు పడ్డారు. ఆమెలో ఇప్పుడు ఆర్థిక జీవితాన్ని గురించిన ఆలో చన్లులేవు. తనకు తోచని, తనకు అంద రాని ఏదో అభిప్రాయాన్నిగురించి ఆలో చిస్తూంది. ఈ ఆలోచనతోనే మెల్లగా నడుస్తూంటె రోడ్డుమీద, అధికారవర్గం అనుమతిస్తూందా? బఱ్ఱున వచ్చింది ఒక కారు. దాని క్రోధనుండి తప్పుకోటానికి ప్రక్కకు తప్పుకుంది. అప్పుడే స్నానంచేసి వేగంగా వెళ్తూన్న వెంకయ్య శాస్త్రిగారి చేత వెయ్యిసార్లు 'పాపిష్టిముండ' అనిపించు కొంది.

ఒక పెద్దబంగళా చుట్టూ విశాలమైన తోట. ఆప్రదేశం ఎంతో రమణీయంగా ఉంది. ఆమెలో ఒక ఆశ-ఇక్కడ బిచ్చ మడిగితే తప్పక పెడతారని. గేటు దగ్గర కెళ్ళింది. కాపలా జవాన్ చేత కఱ్ఱపట్టు కొని "ఏయ్, వెళ్ళు. అవతల పో, ఇదె వరి ఇల్లు అనుకున్నావ్? జాగ్రత్త" అని గర్జించాడు. ఆమె రెండడుగులు వెనుక వేసింది. కాని ఆమె హృదయంలోని ఆశ మాత్రం పోలేదు. మెల్లిగా కాపలావాని

కంటబడకుండ పెరటిగేటు దగ్గరకు వెళ్ళి "అయ్యా! బీదదాన్ని - ఒకింత కబళం పడెయ్యండి బాబూ! అమ్మా! తల్లీ!" అని పుట్టినప్పటినుంచి ఆలాపిస్తూ వస్తూన్న ఆ వృత్తి గీతికను ఆరంభించింది. పలుకలేదు. మళ్ళా గట్టిగా "అయ్యా దిక్కులేని దాన్ని - మహా ప్రభో! " - లోపలినుంచి "ఏయ్, ఎవరక్కడ? ఏమిటా మొత్తుకోళ్లు" అన్న శబ్దం. ఇంతలో ఒకజవాన్ వచ్చి "అయ్యగారు కోప్పడుతున్నారు. వెళ్లు!" అని గదమాయించాడు. అతని భీకరమైన మీసాలను, గంభీరమైన మొహాన్ని చూసి గజగజ వణికిపోయింది. మారు మాటాడకుండా అశ్రుజలనయనాల్తో అతణ్ణి చూసి కదిలింది. ఆఖరుకు ఆరోజు గాంధీమహాత్ముని పునిత వ్రతాన్నే అనుసరించింది.

♦ ♦ ♦

సంధ్యాకాలం ప్రభాకరుని వియోగాన్ని సహింపక ప్రకృతిదేవి ఏడ్చి ఏడ్చి కన్నులెఱ్ఱపడ్డట్లు సంధ్యారుణరాగాలు వ్యాపించాయి. తన వ్యధను పోగొట్టి చల్లని చూడ్కులతో తన్నోదార్చు నెచ్చెలి చంద్రిక కూడా నేడు రాదుగదా! అని ప్రకృతి దేవి మరింత విచారంతో చీర చెఱగుతో కన్నీళ్లు తుడుచుకొంది. చెఱగు కదలిక వల్ల వచ్చిన వేడిగాలి దేవి దుఃఖాన్ని తెల్పుచున్నట్లున్నది. చీకటి దట్టంగా ఆవరించిన కొలది దేవి హృదయ భారం అధికమై, కార్మేఖములు క్రమ్మి వర్షం కురియగా దేవి దుఃఖాశ్రువులు గాబోలు - ఆ అశ్రుజలాన్ని తుడుచుకోడానికి చేతులల్లాడించినప్పుడు మెఱుపుల చేతుల కంకణాలా అనిపించింది.

చెఱువు గట్టున రావిచెట్టు అరుగ మీద కూచొని కటిక చీకటిని కలయ చూసింది. మెల్లిగా లేచింది. తల గిఱ్ఱున తిరిగింది. 'దభీ' మని క్రింద కూలిపోయింది. ఎదుటనున్న చెఱువు శాంతంగా ప్రవహిస్తూంది.

వాన జోరున కురుస్తూనేఉంది. చిరిగిన పాతపేలికలు తడిసిపోయినవి. చలిలో గజగజ వణకుతూంది. "ఈ నిరాశ్రయను ఆదరించే దాతలే లేరా - దేవుడా! నీ వొక్కడవేవున్నావా"అని ఆమెలోనాస్తిక వాదం ప్రబలింది. అసహాయస్థితిలో నిరాశలో మొలిచేది నాస్తికమేగా -

"నిరాశ్రయులైన భిక్షుకులను ఆదరించేవారీప్రపంచంలో ఎవ్వరూలేరా" అని దిక్కులు ప్రతిధ్వనించేలాగ కేకలేస్తూ ఆ కటిక చీకటిలో కలవటానికి పరుగెత్తుకొనిపోయింది.

ఆ నిర్మానుష్య ప్రదేశంలో హృదయ ద్రావకమైన ఆమె మాటలు వినే దిక్కెవ్వరు? అవన్నీ గాలిలో కలిసిపోయాయి; ఆమె చీకట్లో కలిసిపోయింది. ప్రకృతి దేవి హృదయం నిరాశ్రయభిక్షుకి విలాపానికి నిర్దయులపై ఉరిమింది. ఆమె కన్నులనుండి వెల్వడ్డ క్రోధవీక్షణం భయంకరంగా మెరిసింది. ఏమీ ఎరుగనట్లు చెఱువు ప్రశాంతంగా ప్రవహిస్తూంది.

# తెల్లరోజా!

| రచయిత్రి : | అనుసరణ : |
| --- | --- |
| ఇన్‌గే షోల్ | డాక్టరు వి. ఎన్. శర్మ |

## I

యుద్ధం హోరాహోరిగ జరుగుతూవుంది. నాలుగయిదు నెలలల్లో ముగుస్తుంది అనుకున్న ఈ యుద్ధం తొందరగాముగిసిపోతేగా! ఆ రోజుల్లోజర్మను యుద్ధనాయకులు యుద్ధంలో తమకే జయం సమకూరుతుంది అంటూ వేస్తూవున్న ఎత్తులు ఇన్ని అన్ని అని చెప్పాలా! మోసంచేస్తే ఒకసారిచేయవచ్చు. కాకపోతేనా రెండుసార్లుచేయవచ్చు. తరువాత ఆ మోసం ఏరూపాన పరిణమిస్తుందో? ఆ సంగతి అవగాహనంచేసుకుంటే పరిస్థితులు మరోరూపాన వుండిపోయేవేగా! కాని అంత అదృష్టం ఈకష్టకాలంలో ఎవరికి లభిస్తుంది? ... ... యుద్ధవాతావర్ణం మూలాన పట్నవాసాలవారే యమయాతనలని అనుభవిస్తున్నారని అనుకోకండి; ఆ దురదృష్టం గ్రామాలకూ దాపరించింది. ...

మాది కుగ్రామం. పట్నవాసాలు మాకుదగ్గరలో లేవు. అయినా వాయు విమానాలు మా వూరిని వాటి వికటతాండవంలోమరచాయికావు. మా ఇండ్లను నాశనం చేశాయి. తోటల్ని, అడవుల్ని సర్వనాశనం చేశాయి. రాత్రి అయిందా వాటి రణగణధ్వని ఇంతింత అని చెప్పలేం. తిండీ తిప్పలులేవు. నిద్రబొత్తిగాలేదు. ఈ బాధ రాత్రిళ్ళతో ముగిస్తేనా? పగటి పూటల్లోకూడా అవి చేసే తాండవం మూలాన ప్రజాకోటి గగ్గోలుపడటంతప్ప మరేం చేయగలుగుతుంది? ... ... ప్రపంచమే నాశనమై పోతూవున్నట్లువుంది. ఆ గండాన్నుంచి లోకాన్ని రక్షించటం మన తరమా?

మాపని ఇంటి కప్పు మీద నిలుచుండి కాపలా కాయటం, విమానాలు ఇటుప్రక్క రావటం గుర్తించామా, ఆ సంగతి ఇరుగుపొరుగు వాళ్ళకు తెలపటం.

...... ఇలా కాపలా కాస్తూవున్న రోజుల్లో మా వెంట సహాయం చేయటానికి ప్రక్క ఇంటి అబ్బాయి వచ్చాడు. వయస్సులో ఎంతో చిన్నవాడు. బాంబు మాకు సమీపాన్నేవున్న కుగ్రామం మీద పడటం ఆ అబ్బాయి చూసి హడలి పోయాడు. "భగవంతుడు కరుణాకర మూర్తి అని చెబుతారే, అలాటి దయామయుడు ఇలాటి పనుల్ని చేయించటం ఎందుకో?" అని తన బాధను ఆపుకోలేక అన్నాడు.

దానికి ఏమని జవాబు ఇయ్యాలి? ఆ అబ్బాయి గడ గడ వణికి పోతూవున్నాడు. ఉత్త మాటలతో తృప్తిపడే ఘటం అయితేగా! అలాటి దారుణావస్థలో భగవంతుడే దాన్ని వింటే ఎలాటి జవాబు ఇస్తాడో ఆ అబ్బాయిని శాంతింప చేయటానికి?... ...

◆ ◆ ◆

ఇలా మేము కష్ట సముద్రంలో మునిగి తేలుతూ వుక్కిరి బిక్కిరి అవుతూవున్న కాలంలో మా అమ్మను చూసి వెళ్ళడానికి పదే పదే మా వూరికి కొంచెం దూరంలోవున్న కాన్వెంటు నుంచి సిస్టర్లు వస్తూ వుండేవాళ్ళు. దైవసేవారాధనలో ఆ సిస్టర్లకి పెట్టిందే పేరు. ఆ మతాలయం యాజమాన్యం క్రింద ఉన్మాద వ్యాధితో బాధపడుతూవున్న వాళ్లకోసం చికిత్సాలయం నడుపబడుతూ వున్నది. చిన్న పిల్లలకు సంబంధించిన వైద్యశాఖ ఆ వైద్యాలయంలో ప్రత్యేకంగా నెలకొల్పబడ్డది. అక్కడి పిల్లల యోగ క్షేమాలను చూసుకొనే బాధ్యత ఈ సిస్టర్లది. అక్కడి సంగతులను మాకు తరచుగా చెబుతూ వుండేవాళ్ళు......

యుద్ధరంగాల్లో గాయపడి వైద్యసహాయంకోసం తండోపతండాలుగా సైనికులు దేశానికి వస్తూవున్నారు. పెద్ద పెద్ద నగరాల్లోని ఆస్పత్రులు బాంబులమూలాన

నాశనమయ్యాయి. చిన్న చిన్న పట్టణాల్లోని చికిత్సాలయాల్లో కొత్తవాళ్లని చేర్చుకొనటానికి స్థలంలేదు. అంచేత ఇంకేం చేయాలి ఈ సమస్యని తేల్చటానికి? ఇదే అధికార్లని వేధిస్తూవున్న క్లిష్ట సమస్య. అధికార్లు ఆలోచించారు. ఎంతోసేపు ఆలోచించారు ఈ విషమావస్థలోనుంచి ఏదో విధంగా బయటపడటానికి? ... వాళ్లదృష్టి ఈ పిచ్చి ఆస్పత్రులమీదికి చప్పునపోయింది. ... పిచ్చివాళ్లు ఎందుకువుండాలి? వాళ్లకోసం ఇంతశ్రద్ధ తీసుకొనడం ఎందుకు? ... వాళ్లను మాయంచేసి ఆ వైద్యాలయాలను తమ అత్యవసరాలకు వుపయోగించుకొంటేనో? ... అధికారులకు ఇలాటి ఆలోచనలు తట్టాయా, ఇక వాటిని ఆచరణలో పెట్టడానికి సంకోచం అనేది వుంటుందా? ... ఉన్మాదశాలలలోనున్న రోగులను వాళ్ళకితోచిన విధంగా మాయంచేయాలని తీర్మానించుకున్నారు. పై అధికారులూ ఆ పనికోసం తమ సంపూర్ణాధికారాన్ని వెంటనే ఇచ్చివేశారు. ... పెద్దరోగుల్ని చంపివేయాలి అది చాలుతుందా? పిల్లరోగుల్నీ తటపటాయించక చంపివేయాలి. దాంతో కావలసినంతస్థలం ఖాళీఅవుతుంది. ఆ స్థలాన్ని యుద్ధాన్ని ప్రతిఘటించేవాళ్ళకోసం జైలుగా వాడుకోవచ్చు. లేదా యుద్ధరంగాలనుంచి తండోపతండాలుగా వస్తూవున్న రోగులకి ఆస్పత్రిగా వుపయోగించుకోవచ్చు. ... ఇలాటిప్లాన్లు అధికారుల బుర్రల్లో రేగుతూవుంటే ఇక వాటిని ఆపటానికి ఎవళ్ళకి ధైర్యం వుంటుంది - సాహసం వుంటుంది? అధికారుల ఆలోచనలు మరికొన్నాళ్ళకే ఆజ్ఞలుగామారిపోయాయి. ఆ ఆజ్ఞల్ని తు. చ. తప్పక ఆచరణలో పెట్టాలని ఆర్డర్లు మంజూరుచేయబడ్డాయి. ... ...

మామూలు ప్రకారం మా వూర్లోచందాలు వసూలు చేయటానికి ఆ కాన్వెంటునుంచి ఒకరోజున వచ్చారు. మా అమ్మ అంటే సిస్టర్లకి ఎంతో ఇష్టం. అమ్మని చూడడానికి ఆసిస్టర్లు మా ఇంటికే......వాళ్ళ మొహాలు ఏదో విధంగా వున్నాయి. పూర్వపు వుత్సాహంలేదు. కళ్ళనుంచి ఒకే ధార. నోటినుంచి మాట పెగిలి రావడం బ్రహ్మాండమైంది ... వాళ్ళు ఆ సందర్భాన చెప్పిన సంగతులు వింటేనా ఎటువంటి రాతి గుండె మనిషి అయినా గడగడలాడిపోతాడు ... ... అదరాబాదరగా లారీలల్లో ఒక రోజు వేకువజామున్నే పోలీసులు వచ్చారట. పిల్లల్ని పడకల్లోనుంచి చప్పచప్పనలేపి లారీల్లోకి తీసుకుని వెళ్ళారట. అంతా జబర్దస్తీ. సిస్టర్లు ఏం చేయగలుగుతారు అలాటి విషమావస్థలో? ఒక అబ్బాయి బిక్కమొహం వేసుకుని దగ్గరనున్న సిస్టర్ని అడిగాడట ఈ లారీల్లో ఎక్కడికి వెళ్లాలని ......... ఆ సిస్టర్ ఏం జవాబు ఇస్తుంది? ... ... గడగడ వణికిపోయింది ఆ అబ్బాయి ప్రశ్నను విన్నాక. కంట తడిపెట్టుకుంది, ఆ సమయాన ఏ ఆలోచన తట్టిందో? ... "స్వర్గానికి వెళ్ళటానికి ఇలా అదరాబాదరాగా ప్రయాణం చేయాలసివచ్చింది" అని ఆ అబ్బాయిని సముదాయించటానికి అనేసిందట.

అసలు ఆ పిల్లలు రోగులు. ఆ రోగంలో ఎక్కడాలేని వుద్రేకం, ఆవేశం వుండటం సహజంగా! ... వాళ్లలో కొందరు పిల్లలు చప్పున వాళ్లు సిస్టర్ల దగ్గర నేర్చుకున్న భక్తి గీతాలని పాడటానికి ఆరంభించారు. లారీల్లో కూర్చున్నాకకూడా ఈ సంగీతమే! వాళ్ళు ఎక్కడికి వెడుతూవుందీ వాళ్లను మరిపించివేసింది. ... ... వాళ్ళవెంట సిస్టరు వెళ్ళాలసివచ్చింది. ఒక డాక్టరూ వెళ్ళాలసి వచ్చింది. సిస్టరుకన్నా డాక్టరుకు బాగా తెలుసు ఆ పిల్లలకు రాబోయే ప్రళయం. దాన్ని ఆపడానికి ఆయన చేయాలసిన ప్రయత్నాలనుచేశాడట. కాని ప్రయోజనం వుంటేగా? ... అంతేనా? ఆయన ఏమయ్యాడో వాళ్ళను చేర్చాలసిన స్థలంలో దించాక? ఆ భోగట్టా తెలుసుకొనడానికి ఆ క్లిష్టసమయంలో ఎవరికి ధైర్యం వుంటుంది? ............

యుద్ధరంగాన్నుంచి మా ప్రాంతాలకు సంబంధించిన యుద్యోగి యొకడు సెలవుమీద ఇంటికివచ్చాడు. వాళ్ళ అబ్బాయికి బాంబుల రోదనం మూలాన

పిచ్చెత్తిపోయింది. ఆ వ్యాధిని కుదర్చటానికి అబ్బాయిని ఈ వైద్యాలయంలో చేర్చారు. యుద్ధరంగంలో వున్నప్పుడు అధికారికి వుత్తరాలు వస్తూ వుండేవి. అబ్బాయికి నయమవుతుందనీ త్వరలో ఆస్పత్రినుంచి ఇంటికి వెళ్ళిపోవచ్చుననీ వుత్తరాల్లో భార్య పదేపదే తెలుపుతూ వుండేది. ఆయన ఇంటికి వచ్చే లోపుగనే అబ్బాయీ ఇంటికి చేరుకుంటాడని ఆశపడుతూవుండేవాడు. ఈ అబ్బాయే వాళ్ళకు ప్రాణం. అన్ని ఆశలూ వాడి మీదే ... ఉద్యోగి ఇంటికి వచ్చాడు. కాని అబ్బాయి బ్రతికివుంటేగా వాణ్ణి కళ్ళారచూసి ఆనందించేటందుకు? ........

ఇలాటి సంఘటనలను ఈ దేశంలో ఎంతమంది తలిదండ్రులు ఎదుర్కోవాలసి వచ్చింది? ఆ సంగతి చెప్పబూనుకుంటే తలల్ని ప్రేలవేసుకోవాలి. ఆ అవమానాన్ని భరించలేక ... కాలపురుషుడు అలా విధించాడు. దాన్ని తు.చ. తప్పక చేయటం మన విధి. అంతకన్నా మరేం చేయగలుగుతాం ఈ క్లిష్ట పరిస్థితుల్లో? ...

II

మా హాన్సు, వాడి స్నేహితులూ యుద్ధదళాలతో రష్యా యుద్ధరంగాన పనిచేస్తూవున్నారు. ఆ యుద్ధం ఒక విధంగా తెమిలేటట్టువుంటేనా? రష్యనులది తోడేళ్ళబలం. ఏఎత్తుకు ఆ ఎత్తు వేయటంలో వాళ్ళని చెప్పే, ఇతర్లని ఎదుర్కోవాలి. అది చలికాలం. రాత్రింబగళ్ళు విధవిరామంలేకుండా భరింపరానంతచలి. దానికి సహాయంగా మంచువర్షం. బయటకదలటానికి వీలులేనంత మంచు. బయటికి వెళ్ళదలంచిన వాళ్ళు పడాలసిన యమయాతన ఇంతింత అని చెప్పాలా? ఆ దేశంవాళ్ళకి ఇదంతా తెలుసు. అంచేత అస్తమానమూ ఇంట్లోనే బిచాణా వేస్తూ వుండేవాళ్ళు. పరాయివాళ్ళకి, ముఖ్యంగా వాళ్ళ పరమశత్రుకోటికి సంబంధించిన జర్మను సైనికులకు ఇలా ఇంట్లోబిచాణా వేస్తూవుంటే ముందుజరగాలసిన పని ఎవళ్ళు చూసుకుంటారు? ...

జర్మను సైనికుల యమయాతన మాటలతో చెప్పదలచుకుంటే పెద్ద పురాణమవుతుంది. అంతకన్నా నరకబాధని అనుభవిస్తూవున్నవాళ్ళు యుద్ధరంగంలో గాయపడ్డవాళ్ళు. పేరుకు ఆస్పత్రి అని ఒక గుడారం వుంది. ఆ గుడారంలో రోగులు ఈ చలికి ఆగకలుగుతారా? ...

తిండిలేదు. వైద్యసహాయంచేయటానికి వైద్యవిద్యార్థులు అక్కడవున్నా, వాళ్ళ పనిపాటలకి అత్యవసరమైన పరికరాలు వుంటేగా! ... అయినా విద్యార్థులు వాళ్ళ విధ్యుక్తధర్మాల్ని తప్పక నెరవేర్చాలిగా!

ఇలాటి గుడారంలో హాన్స్ మాసాలపర్యం వైద్యసేవచేస్తూ వుండాలని వచ్చింది. రాత్రిళ్ళు డ్యూటీ. పగలూ అంతే. దగ్గర తనకి సహాయం చేయటానికి మనుష్య సహాయం అనేది కొంత వరకు వున్నా, ఈ చలిలో, ఆ మంచులోవాళ్ళు సతమతమై పోతూవున్నారు. అలాటి అవస్థలో వాళ్ళుచేయగల సహాయం కొద్దే. తనూ ఎన్నెన్నో కష్టాలని ఎదుర్కోవాలసి వస్తూవున్నా, వాటిని పూర్తిగా మరచిపోయాడు హాన్స్. వాడి ధ్యానమంతా కాళ్ళని విరగగొట్టుకున్న, చేతుల్ని పోగొట్టుకొన్న, ఇతర అవయాల్ని యుద్ధదేవతకి సమర్పించుకున్న ఆ రోగుల మీదే. ఆ కష్ట సమయంలో వాడేవాళ్ళకి తల్లి తండ్రీ, అన్న, తమ్ముడు. నర్సుకూడావాడే. అలా, ఆ అనాథులకి శాయశక్తులా పరిచర్యచేస్తూ తన సొంత కష్టాలనే పూర్తిగా మరచిపోయేవాడు.

నిలకడగా ఒక చోట వుండనిస్తారా ఇలాటి వైద్యాలయాల్ని అధికారులు? ఇవ్వాళ ఒక చోట. ఆ రోజు సాయంకాలానికి మరోచోటికి చప్పచప్పన మార్చివేయాలి ఈ గుడారాల్ని. ...

ఇలా సంచారము చేస్తూవున్నకాలంలో హాన్సు సంపాదించిన అనుభవాల్ని ఇక చెప్పాలా? అలాటి అనుభవాలు సామాన్యులకబ్బుతాయా? ...

అలా ఒక చోటినుంచి మరో చోటికి క్యాంపులను మారుస్తూ సంచారంచేస్తూవున్న సమయాన

హాన్స్‌కి తను యుద్ధరంగంలో ఇంతవరకూ కళ్ళారా చూస్తూ హడలిపోతూవున్న సంఘటనలు ఎన్నో జ్ఞాపకంవస్తూ వుండేవి.

... ఆ రోజున హాన్స్, వాడిస్నేహితులూ ఇతర సైనికులవెంట రష్యాను రంగంలో ఒక కొత్త ప్రదేశాన్ని చేరుకోనటానికి రైల్లో ప్రయాణంచేయాలసి వచ్చింది. అది మిలిటరీ స్పెషలు. దాన్లో మిలిటరీకి సంబంధించినవాళ్ళు మినహా ఇతర్లు, ఎటువంటి అవసరమైన పనులకోసం వెళ్ళాలసివున్నా, కాలుపెట్ట కూడదు. ...

నీళ్లను పట్టుకోటానికనో, లేక పోతే మరో కారణం మీదనో ఆ మిలిటరీ స్పెషలు దోవలో ఒక్క స్టేషను దగ్గర కొంతకాలం ఆగిపోయింది. ప్లాటుఫారంమీద జనం క్రిక్కిరిసివుంది. ఆ జనాన్ని చూసేటప్పటికి నేల ఆపళాన ఈనినట్లువుందే అని హాన్స్ విస్తుపోయాడు. ఎంత మంది జనం! ఎంత మంది జనం! ఎక్కడినుంచి రావటం? ఎక్కడికి వీళ్ళ ప్రయాణం? వాళ్ళని చూసేటప్పటికి వాళ్ళు ఎలాటి దుర్భరావస్థలో కూలబడి పోవాలసి వచ్చిందో వుత్త మాటలతో ఎలా చెప్పాలి ?...తదేక దృష్టితో హాన్స్ ఒక గుంపుని చూశాడు. అక్కడ వున్నది స్త్రీలు, ఆడబిడ్డలు. కాళ్ళకి బంధాలు వేసివున్నాయి. వాళ్ళంతా "యూదులని" ఇతర్లకి తెలుపుటకు కాబోలు వాళ్ళ మెడల్లో యూదు జాతికి సంబంధించిన సంకేతాన్ని ఇనపరేకుల మీద చిత్రించి కట్టారు. మొహాలు వెల వెల బారివున్నాయి. ఎప్పుడు నిద్రపోయారో? ఎప్పుడు పట్టెడన్నాన్ని తిన్నారో? ఆ సంగతిని తలచేవాళ్లు ఎవళ్ళయినావున్నారో పాపం లేరో... బెదిరిన జంతువులకిమల్లె, రైలు ఆగిందో లేదో, పెట్టెలవైపుకి చూడసాగారు. పెట్టెల్లో వున్న వాళ్లని చూస్తూ హడలిపోతూ వున్నారు... ఆగుంపులో వున్న వాళ్ళని చూసేటప్పటికి హాన్స్ తన పెట్టెలో మరో నిమిషం వుండలేక పోయాడు. గబాలున తను కూచున్న పెట్టెలోనుంచి క్రిందికి దూకి చప్పుచప్పున వాళ్ళ దగ్గరకి పరుగెత్తాడు.

వాళ్ళ యోగక్షేమాల్ని ప్రశ్నించటానికి ప్రారంభించాడు. ఈ గుంపులోని వాళ్లు, వాళ్ల వాలకాల్ని చూశాక పరాయి దేశాలవాళ్ళనీ, ముఖ్యంగా నాజీలు ఒకేపళాన వాళ్ళని నామావశష్టం చేయటానికి చేయాలసిన పన్నాగాలని పన్నుతూవున్న యూదులనీ, అతిసులభంగా గ్రహించాడు. ఇలా వాళ్ళని ఇక్కడ బంధించి వుండటం ఏజైలులోకో పంపటానికి అయివుండాలి; లేదా ఈ అనాథలను నాజీరాక్షస పద్ధతులతో మాయం చేయటానికయినా అయివుండాలి.

ఇలాటి పద్ధతులు నాజీలు అదురూబెదురూ లేకుండా ఎలా అవలంబిస్తూవున్నారో హాన్స్‌కి బాగా తెలుసుగా! హాన్స్ మిలిటరీ యూనిఫారంలో వున్నాడు. అలాటివాడు ఇలా సాహసం చేసి ఆ అనాథులను చూడడానికి రావటం, వాళ్ళని పలకరించటమూ తప్పు... రాజద్రోహం క్రిందికి వచ్చే అపరాధంకూడా! ఆ సంగతి తలపోస్తూవుంటే తన విధ్యుక్త ధర్మాన్ని ఎలా నెరవేర్చుకోగలుగుతాడు హాన్స్? ... నోటినుంచి మాట పెగిలివస్తేనా వాళ్ళనుంచి హాన్స్ఎంత ఆప్యాయంగా వాళ్ళతో మాట్లాడినా? చలికి గడగడవణకి పోతున్నారు. దేహం కుషించివుంది ....ఏమనుకున్నాడో వాళ్ళ ఈ దీనావస్థనుచూశాక? జేబులో తను దాచివుంచుకొన్న భోజనపదార్థాల్ని తీశాడు.........................

ఆ రోజుల్లో భోజనపదార్థాలంటే చాక్‌లెట్లూ, బాదంపప్పు, ఎండిపోయిన పళ్లూ - ప్రొద్దునా, మధ్యాహ్నం, సాయంకాలం ఈ యుద్ధరంగంలో సేవచేస్తూవున్నవాళ్లు ఆకలి బాధనుంచి తప్పుకోటానికి వాడుకోవాలసిన ఆహార పదార్థాలు. ఇవే వాళ్ళ రేషను! ఆ రేషనుతో ఆకలి తీర్చుకోవాలి. అవీ లభించని రోజులూ వున్నాయి. కాని ఆ సంగతినా ఇప్పుడు తలపోయటం! ... తన భోజన పదార్థాల్నే తటపటాయించకుండా వాళ్ళకీయనిశ్చయించాడు. వాటిని వాళ్ళ దగ్గర వుంచాడు.

ఆ గుంపులో ఒక ముసలాయన ఆ స్త్రీలకు

వెనుక కదలమెదలలేక నానా అవస్థలను పడటం హాన్స్ చూశాడు. వాళ్ళ అమ్మాయి, పసిపిల్ల, ఆయనకి శుశ్రూష చేస్తూవుంది. వాళ్ళ ఆస్తి పాస్తులు ఒక చిన్న పెట్టె. ధరించిన దుస్తులు చినిగిపోయినవి. ఈ చలికి అవి చాలుతాయా? వాళ్లు చలికి భరించలేక ఎలా అవస్థపడుతున్నారో ఇక చెప్పాలా? వాళ్లని పలకరించాలని హాన్స్ ఆశ. ఇక వాళ్లసంగతా! హాన్స్ అక్కడికి రావడం చూశాక మరే బాంబు వాళ్లమీద పడుతుందో అని హడలి పోతూవున్నారు. వాళ్ళ ఆగాథరాని, ఆకంగారుని చూడాలి! వాళ్ళను అరెస్టు చేయడానికే అతను వాళ్ళదగ్గరకు వస్తూవున్నాడని వాళ్ళ భయం..................ఎంత సముదాయించినా వాళ్లు వింటేగా! ఇంకేం చేయగలుగుతాడు? ... తలని దించుకొని తిరిగి తను కూచున్న పెట్టెలోకి వెళ్లాడు హాన్సు. ఆదృశ్యాన్ని తలపోస్తూ హాన్సు పడ్డబాధని ఎలా మాటలతో చెప్పగలుగుతాను? ..............

♦ ♦ ♦

ఇంకోసారి ఈ ప్రాంతాల్లో రైల్లో ప్రయాణం చేస్తూవున్న సమయాన మరో విషాధ ఘట్టాన్ని హాన్స్ కళ్లార చూడాలసివచ్చింది. వెట్టిచాకిరి చేయటానికి మిలిటరీ వాళ్లు వుపయోగించుకొంటూవున్న ఒక కార్మికదళం రోడ్డుప్రక్కనే సమావేశమైవుంది. అదృష్టవశాత్తున రైలుబండీ వాళ్ళ దగ్గరే కొన్ని నిమిషాలు ఆగిపోయింది. పేరుకి కార్మికదళంకాని దాన్లో వున్నవాళ్లు శత వృద్ధులు. వాళ్లూ యూదులే. వాళ్ళని నిర్బంధ సేవకోసం ఈ దళంలోకి ఈడ్చుకొని వచ్చారు. ఆ విగ్రహాల్ని చూస్తేనే చాలు వాళ్లు పేరు ప్రఖ్యాతులుగాంచిన డాక్టర్లు, శాస్త్రజ్ఞులు, పండితులు అని సులభంగా చెప్పివేయవచ్చు. కాలం మారిపోయింది. అదే వాళ్ళని తన వాహినిలోకి లాక్కువచ్చి పెట్టరాని యమయాతనలను బెడుతూ వికటనాటకాన్ని ఆడుతూవుంది. సున్నితమైన వస్తువుల్నే వాడినవాళ్ళ హస్తాలు నేడు పారల్ని వుపయోగించాలసివచ్చింది. వాళ్లు ఖైదీలు - పోలీసులు చెప్పుచేతల్లో వుండాలసి వచ్చింది. అస్తమానము రోడ్లను బాగుచేయాలి. ... ఇక్కడ వాళ్ళు ఎందుకు వేచి వుండాలసి వచ్చిందో? మరో క్రొత్త చోటికి తీసుకుని వెళ్ళడానికే వాళ్ళని ఇక్కడికి తీసుకుని వచ్చారు మిలిటరి పోలీసులు. వాళ్ళను చూసేటప్పటికి హాన్స్‌కి చెప్పరానంత జాలివేసింది. కాని ఏం చేయగలుగుతాడు ఆక్లిష్ట పరిస్థితుల్లో? పోలీసులకి తెలియకుండా తన పెట్టెలోనుంచి సిగరెట్ పాకెట్లులని వాళ్ళ దగ్గర పడేశాడు ........ బండి కదిలాక వాళ్లు వీటిని ఎంత ప్రాణప్రదంగా చూస్తూవున్నారో చూశాడు హాన్స్. హాన్స్ బరువు దాంతో కొంత వరకు తగ్గిందే అని చెప్పవచ్చు......

ఇలాటి సంఘటనను మరొకదాన్ని హాన్స్ కొన్నాళ్ళక్రిందట ఎదుర్కొనాలసివచ్చింది. దాన్నిమరచిపోవాలని ఎంతో ప్రయత్నించాడు. కాని దాన్ని ఎలా మరచిపోవటం? కలలోకూడా దాన్నే చూస్తూవున్నాడు. అదేఇప్పుడు హాన్సుని కదిలించివేస్తూవుంది.

♦ ♦ ♦

ఈ సంఘటన తన స్వగ్రామానికి దగ్గరలో నేవున్న ఆస్పత్రిలో జరిగింది. యుద్ధం ప్రారంభమైన రోజుల్లో బాంబుల వర్ష ధాటికి గురియైన వాళ్లెంతమందో ఈ స్థలంలో చికిత్స పొందుతూవున్నారు! ఒకరోగి స్వస్థత చెందాడని డాక్టర్లు అనుకుని అతన్ని ఆస్పత్రిలోనుంచి వాళ్ల ఇంటికి పంపివేయాలని నిశ్చయించుకున్నారు. అదేం దురదృష్టమో పాపం! అతన్ని పంపివేయాలని నిశ్చయించుకున్న రోజున్నే, మాని పోయిందనుకున్న చేతిగాయం చప్పునవాచింది. రక్తం ఒకేధారగా కారడం ప్రారంభించింది గాయాల్లోనుంచి. డాక్టర్లు దీన్నంతాచూచి స్థంభించిపోయారు. చేయాలసిన చికిత్సని చేశారు. కాని ఆ రక్తం ఆగితేగా! దాంతో ఆ గాయపు భాగాల్నే కోసివేయటానికి తీర్మానించుకున్నారు డాక్టర్లు. ఆ మూలాన అయినా ఆ రోగి ఆ విషమావస్థలోనుంచి బయటబడగలడని డాక్టర్ల ఆశ. ఆరోగి భార్యకు తెలుసు భర్త ఆరోజున్నే ఇంటికి రాబోతున్నాడని. ఆ ఆశచేత ఆవిడ భర్తను ఇంటికి తీసుకుని వెళ్లడానికి ఆస్పత్రికి వచ్చి గుమ్మంముందర వేచివుంది. ఎంతసేపు వేచివున్నా భర్తరాడే? ... ... తరువాత చెప్పారు, ఆపరేషనుకి భర్త తట్టుకో లేక ప్రాణాల్ని విడిచాడని......ఆవిడ అవస్థ ఆ సమయాన చూడాలి! ఆదృశ్యాన్ని ఎలా మరచిపోతాడు హాన్స్ ఇప్పటికీ, ఆ సంఘటన జరిగి ఎంతోకాలం అయిపోయినా!

# ప్రేయసీ



## వద్దకు



# ప్రయాణం

శ్రీ గిడుగు వేంకటరామమూర్తి

| | | |
|---|---|---|
| మాధవరావు | : | తండ్రి |
| మోహనరావు | : | మేనల్లుడు |
| కృష్ణమూర్తి | : | కొడుకు |
| రమేష్ | : | కొడుకు స్నేహితుడు |
| ప్రకాశరావు | : | ఇంటివాడు |
| గోపాల్ | : | ఇంటి వైద్యుడు |
| సుశీల | : | కూతురు |

### 1–వ రంగం

[మాధవరావు యిల్లు. మధ్య తరగతి కుటుంబం వారిదన్నట్టు గది అమర్చబడి ఉంటుంది. 1 టేబుల్, 3 కుర్చీలు, గోడకు గడియారం, పెద్ద ఆఫీస్ కేలండర్, ఆతని భార్యఫోటో పెద్దది ఒకటి ఉంటాయి. ఫిబ్రవరి 7–వ తేదీ, సాయంత్రం 6 గంటల సమయం. సుశీల అప్పుడే ఆఫీసునుండివచ్చి, చీకటిగా ఉండగా పాట పడుకుంటూ దీపం వెలిగిస్తుంది. తర్వాత పాడుతూ యిల్లు సవరించి చక్క జేస్తుంది.]

సుశీల:_ విద్యయె విజ్ఞానం
విజ్ఞానమే స్త్రీలకు ఆభరణం ||వి||
మనమున విరసే పువ్వం
హృదయములు కరగే గానం
మదిలో కలుగానందం
విద్యయే విడరాని విత్తం ||వి||
అదియే ఒక తరచని సంద్రం
గనిలో తరగని బంగారం ||అది||
స్త్రీ జాతిలో కలిగే వికాసం
మానవజాతికనంత ప్రమోదం ||వి||

మాధవ:_[ఆఫీస్ నుండి అప్పుడే వస్తాడు. కండువాను సుశీల అందుకుంటుంది. చొక్కా చిరిగి ఉంటుంది.]

ఎంతసేపయిందమ్మా నువ్వు ఆఫీస్ నుండివచ్చి ?

సుశీల:_ఇప్పుడేనండీ, పదినిమిషాలవుతుంది ... మీరు యివాళ వేగం వచ్చారే!

మాధవ:_ఆఁ. ఏదో యివాళ వేగంపోనిచ్చారు. ఇవాళ జీతాలు యిచ్చే రోజుకదూ ! అందుచేత అందరూ వేగం పోతాం అంటే ఏమి అనలేక వదిలిపెట్టారు.

సుశీల:_బాగుందండీ మీ ప్రెస్ పని! రోజూ ఉదయం ఎనిమిది గంటలకువెళ్లి రాత్రి ఎనిమిది గంటలకు రావడం ! ఫ్యాక్టరీ యాక్టు ప్రకారం రోజుకు ఎనిమిది గంటలే కదండి పనిచేయాలి ! ఈ మిగిలిన నాలుగు గంటలకు O. T. యిస్తారా ?

మాధవ:—ఏమిటమ్మా అన్నావు! ఓ. టి. అం- ఓవర్ టైమ్ పనిచేసే లేబరర్సుకేనట! మేమంతా ఆఫీసుస్టాఫ్! మాకు యివ్వనన్నాడు ప్రొప్రైటరు. ఒక రిద్దరు ఫాక్టరీ ఇన్‌స్పెక్టరుకు రిపోర్టు చేస్తే వాళ్లకు ఒక్కొక్క నెల జీతమిచ్చి యింటికి పంపించాడు. గట్టిగా అడిగితే నాకూ అదే గతి పడుతుందని భయం. అందుకని మాట్లాడకుండా పనిచేస్తున్నాను.

సుశీల:—ఇలా మీరు రోజుకు 12 గంటలు పనిచేస్తే మీ ఆరోగ్యం ఏమవుతుంది చెప్పండి?

మాధవ:—ఏమయినా సరే తప్పదు. నువ్వు ఈ పాటికి కాపురంచేస్తూ ఉండవలసిన దానివి. నీ చేత పనిచేయించి, నీ ఆర్జనమీద కుటుంబము నడుస్తూవుంటే నేను చూస్తూ ఊరుకోగలనా? మన మిద్దరము సంపాదిస్తేనే చాలీ చాలకుండ గడుస్తోంది. ఇలా కష్టపడి నేను పనిచేయక పోతే మరి అడగక్కరలేదు....

సుశీల:—సరేగానండీ! ... నాన్నగారూ! మీ జీతం అందిందికదా రెండు చొక్కాలు కుట్టించుకో కూడదూ?

మాధవ:—అమ్మాయ్! అప్పులుతీరి అవతలపడితే చొక్కాలు కుట్టించుకున్నట్టే!

సుశీల:—అప్పులు ఎప్పుడూ ఉంటూనే ఉంటాయి. అవి త్వరలో తీరేవయితే బాగానే ఉండును. అందుకనే మీరు ఈ వయసులో ఉద్యోగము చేస్తూంటే వద్దనలేకుండా ఉన్నాను.

మాధవ:— మీ అన్న చదువు పూర్తి అయితే మనం గట్టెక్కినట్టే! ఈ మూడు నెలలూ ఎలా గడుస్తాయో?

సుశీల:—చదువు పూర్తయితే సరా! వాడికి వెంటనే ఉద్యోగం దొరకవద్దూ!

మాధవ:—ఉద్యోగం దొరక్కపోయినా వాడికి వేరే డబ్బు ఎత్తిపంపించనక్కరలేదుగా? అప్పుడంత కష్టమనిపించదు. అంతవరకు మనకు ఈ పాట్లు తప్పవు.

సుశీల:—సరేగాని; మీరు వెళ్లి రెండు చొక్కాలకు గుడ్డలు కొనుక్కరండి. ... ...

మాధవ:—ఇవ్వవలసినవన్నీ లెక్కవేశావా? మిగిలితే చూద్దాం.

సుశీల:—వేశాను (పద్దుపుస్తకంతీసి చదువుతుంది) పాలు పెరుగు పది; బొగ్గులు కట్టెలు పది. కిరాణీ బియ్యం ముప్ఫైఅయిదు. చాకలికి అయిదు. ఇవి మొన్న నేను యిచ్చేశాను.

మాధవ:—నీ జీతం 60/= సరిగ్గా అయిపోయింది. నీ చేతిలో కానీ మిగలలేదన్నమాట! ఇంకా మిగిలిన బాకీలు!

సుశీల:—అద్దె—15, రమేష్‌కి—15, డాక్టరుకు—10, అన్నయ్యకు—20 పంపించాలి.

మాధవ:—నా అరవైకి లెక్కవేసి పెట్టావు. ఇంకేం మిగులుతుంది?...... నెలపొడుగునా ఖర్చు! ... ఈ లెక్కల ప్రకారము జరిగినా బాగుండేది.

సుశీల:—ఏం?

మాధవ:—మొన్న రెండు రోజులు సెలవు పెట్టాను. చూడు - ఒక రోజు జీతంపట్టుకున్నారు.

సుశీల:—అదేమిటండీ మరీ అన్యాయంగావుంది మీ Press పని! ఓ. టి. యివ్వరూ, ఇవ్వరు; సెలవు పెడితే జీతం పట్టుకుంటారా - చాల బాగుందండీ! అడిగేవాళ్లులేక ...

మాధవ:—ఏంచెయ్యమన్నావు? నా జీతం 60/= కాదు. 50/= అనుకుంటాను; ఆ పది రూపాయిలు ఓ. టి. గా యిస్తున్నారని సంతోషిస్తాను.

సుశీల:—మీ సంతోషం భలేబాగుందండీ!

మాధవ:—ఔను – ఎక్కడి కక్కడ సంతోషిస్తూ ఉండాలి. ఈ ఉద్యోగము వదిత్తే మళ్ళీ నాకు ఉద్యోగంయిచ్చే వాడెవడు?......మా ప్రొప్రైటరు అంటూఉంటాడులే "ఈ ముసలివాళ్ళకు ఉద్యోగం ఇవ్వటంవలన నష్టం వస్తూన్నది; పని తొందరగా చేయలేరు. రోజులో చేయవలసినపని రోజున్నర చేస్తారు. అయినా నమ్మకంగా చేస్తారని ఉంచవలసి వస్తోం"దని.

సుశీల:—ప్రొప్రైటర్లు ఎలాగైనా అంటారు. వాళ్ళకు కావలసినది లాభం ... ...

మాధవ:—నేను అలా వెళ్ళి డాక్టరుకు 10 రూ. యిచ్చి వస్తాను. తక్కినది నీ వద్దఉంచు (డబ్బు యిస్తాడు)

సుశీల:—డాక్టరు Bill యింకా ఎంత ఉంటుంది?

మాధవ:—ఇంకో పాతిక ఉంటుందనుకుంటాను.

సుశీల:—ఇంకా పాతికఉందీ! అమ్మపోయినా డాక్టరు బిల్లు మాత్రము బ్రతికియున్నది.

మాధవ:—రోగి చనిపోయినంత మాత్రాన డాక్టరు బిల్లు చేయడం మానేస్తాడనుకున్నావా? పేషంటు చచ్చినా, బ్రతికినా బిల్లు చెల్లించితీరవలసిందే. మన డాక్టరు యింకా చాల నయం – ఎంత యిచ్చినా పుచ్చుకొని తృప్తిపడతాడు "Bill చెల్లించనిదే మందు యివ్వ"ననడు. అందుకు మనం సంతోషించాలి.

సుశీల:—మంచిరోజు లొస్తాయనుకొంటూ మనం కాలం గడపవలసిందేనా?

మాధవ:—అమ్మాయ్! నిన్నుచూస్తే నాకు జాలి వేస్తుంది. ఉదయమే 5 గం||లకు లేస్తావు. నా కోసమని వంట వేగంగా చేస్తావు. నీ ఆఫీసుకు వెళ్ళి అక్కడ కష్టపడి పనిచేసివస్తావు. మళ్ళీ రాత్రి వంట—నీకు విశ్రాంతిలేదు. నేను సాయం చేద్దామంటే వీలుకాకుండాఉంది.

సుశీల:—ఆడదాన్నయి పుట్టిన తరువాత వంటచేయకుండా జరుగుతుందా?

మాధవ:—అలాగని ఒక్కవంటే చేస్తున్నావా? ఉద్యోగంకూడ చేస్తున్నావు.

సుశీల:—చదువు చెప్పించినందుకు ఆ మాత్రం మీకు తోడుగా ఉద్యోగంచేసి ఆర్జించటంతప్పా?

మాధవ:—అందుకనే నువ్వు నా కొక కొడుకు వంటూ టాను.

సుశీల:—మీరు వెళ్ళిరండి నాన్నగారూ! (మాధవ రావు వెళ్తాడు. సుశీల చింకి చొక్కాలు కుడుతూ పాట పాడుకుంటుంటుంది.)

రమేష్:—(ప్రవేశించి) మాధవరావుగారూ?

సుశీల:—ఎవరది? ... ... ఓ! మీరా!

రమేష్:—మీ నాన్నగారు లేరూ?

సుశీల:- లేరండీ.

రమేష్:—ఎక్కడికి వెళ్ళారు?

సుశీల:—వీధిలోకి.

రమేష్:—అంటే?

సుశీల:—డాక్టరు యింటికి.

రమేష్:—ఏం?

సుశీల:—ఏంలేదు - డబ్బు చెల్లించి రావడానికి.

రమేష్:—నా బాకీ యింతవరకు చెల్లించలేదే?

సుశీల:—ఇవాళేకదండీ ఆయన జీతం అందింది.

రమేష్:—ఆయన జీతం ఎప్పుడందితే నాకేం? ప్రతి నెలా 1-వ తేదీకి చెల్లుకొడుతూ ఉంటానని ఒప్పుకున్నాడు.

సుశీల:—మీరు తప్పదంటే వచ్చేనెలనుంచి నా జీతం అందంగానే చెల్లుకొడతారులెండి.

రమేష్:—ఆఁ, ఊరకే అన్నాను నువ్వు ఏమంటావో అని. మీరు యిచ్చినా యివ్వకపోయినా నేను అడగదలచుకోలేదు. మీఅన్నయ్యా నేను ప్రాణ

స్నేహితులంగదా ! ఆ మాత్రం వెనుకముందూ అయితే సర్దుకోలేననుకున్నావా !

సుశీల:—అందునుంచే మాకు కొంతధైర్యంగా ఉండి మీదివెనుక నడుతూ వచ్చాము.

రమేష్:—అసలు యివ్వనే వద్దంటే మీనాన్నగారు వినరు. అనవసరంగా బాధపడుతున్నారు. ఇన్ని బాధలుపడకుండా హాయిగా ఉండండి అంటే వినరు.

సుశీల:—మాకెలా వీలవుతుంది?

రమేష్:—ఎందుకు వీలుకాదు ? నేను చెప్పినట్టు చేయండి. ...ఏం చెప్పమన్నావా ? ... నీ కిష్ట మయితే -

సుశీల:—(గ్రహించి) అదేదో నాన్నగారితోనే చెప్పండి

రమేష్:—నువ్వు ఒప్పుకుంటేగాని ఆయన ఏదీ చేయరు!

సుశీల:— నా యిష్టాయిష్టాలు ఆయనకు బాగా తెలుసును.

రమేష్:—నువ్వు పాపం చాలా కష్టపడుతున్నావు... నేను...

సుశీల:—పాపం ! చూడలేకుండా ఉన్నారు కాబోలు! ఎంతటి ఉదార స్వభావులు !

రమేష్:—నేనుచెప్పినట్టు చేస్తే నా ఉదార స్వభావం నీకే తెలుస్తుంది ... నిన్ను ...

సుశీల:—మీ ఉద్దేశం నాకు అర్థమయింది కాని ...

రమేష్:—కాని ?

సుశీల:—నా కిష్టంలేదు.

రమేష్:—నేనంటే నీ కిష్టంలేదూ ?

సుశీల:—ఔను.

రమేష్:—నేను ఆ మోహనరావుకన్నా తీసిపోయానా?

సుశీల:—మీ కున్నంత ధనం అతనికి లేకపోయినా నా దృష్టిలో మీ కన్నా అతను గొప్పవాడే !

రమేష్:—ఆ దొంగ - నీచుడు నీకు ప్రియుడు ! చాలా మంచివాడ్ని ప్రేమించావు !

సుశీల:—మీరు అన్నయ్యకు స్నేహితులని చనువుగా మాట్లాడుతున్నానని నాస్వవిషయాలలో జోక్యం కలుగచేసుకుంటున్నారు, మీకు అనవసరం ; మీరు మీ దారిని వెళ్లవచ్చు [అంటూ చాలా నిరసనగా లోనికి వెళ్తుంది.]

రమేష్:—సరే - నా తడాఖా చూద్దువుగాని (పోబో తాడు మాధవరావు ఎదురవుతాడు.)

మాధవ:—ఏం రమేష్, ఎంతసేపయిందివచ్చి ?

రమేష్:—ఇప్పుడే.

మాధవ:—నీ కెందుకూ శ్రమ మీ యింటికి నేనువచ్చి యిస్తాగా ?

రమేష్:—శ్రమ కేముంది ... ఏం అలా ఉన్నారు ?

మాధవ:—జీతాలు వచ్చేవరకు ఎప్పుడొస్తాయా అని కనిపెట్టుకుని ఉండడం, తీరా జీతాలొస్తే, ఎలా సర్దడమా అని ఆలోచన.

రమేష్:—మీరు ఎన్నాళ్లు యిలా యిబ్బందులు పడ తారు ?

మాధవ:—ఏం చెయ్యను నాయనా ?

రమేష్:—హాయిగా విశ్రాంతి తీసుకోవలసిన వయ సులో మీరు యింకా ఉద్యోగం ...

మాధవ:—నా దుర్దినాలు !

రమేష్:—దుర్దినాలంటే లాభం ఏమిటి ? మీరు కోరి కష్టాలు కొనుక్కుంటున్నారు. ... అసలు యింత వరకు మన ఊళ్లో ఆడవాళ్లు ఉద్యోగాలు చేయ లేదు; మన సుశీలే మొదటిది. అందుకే ఊళ్లో నలుగురు నానా విధాలుగా అనుకుంటున్నారు.

మాధవ:—మనం ఏంచేయగలం !

రమేష్:—దానికి తోడు సుశీల ఆఫీస్‌నుండి వస్తూ మోహన్‌రావుతో మాట్లాడం చూసి నలుగూరు ఏమనుకుంటూన్నారో మీకేం తెలుసు ?

మాధవ:—అనుకుంటే అనుకుంటారు ... అయితే ఏం చేయమంటావ్!

రమేష్:-శీఘ్రంగా మీ అమ్మాయికి మొదట పెళ్ళి చేయండి!

మాధవ:—దాని పెళ్ళిచేసే తాహతు నాకుంటే మీ చేత మీ చేత నేనెందుకు మాటలనిపించుకుంటాను చెప్పు!

రమేష్:-మీరు మరోలా అనుకోనంటే చెప్తాను.

మాధవ:—నా మేలు కోరి నువ్వు చెప్తూంటే నేను యింకోలా ఎలా అనుకుంటాను?

రమేష్:-మీ అమ్మాయిని చేసుకోవాలని నాకుంది.

మాధవ:-(నవ్వుతో) ... కాని దానికి యిష్టముండ వద్దూ?

రమేష్:-మీ మాట కాదంటుందా?

మాధవ:-చదువుకున్నది, దాని బాగోగులు అది చూసుకోగలదు. ఆ విషయంలో దాని యిష్టమే నా యిష్టం.

రమేష్:-బాగా ఆలోచించండి; ఉభయ ఖర్చులూ నేను పెట్టుకుంటాను. మీ అప్పులన్నీ నేను తీర్చేస్తాను. కృష్ణమూర్తి ఏం చదువుతానంటే ఆ కోర్సు చదివిస్తాను. ఏ కష్టమూ లేకుండా హాయిగా మీరు ఉండవచ్చును — ఏమంటారు?

సుశీల:—హల్లో మిష్టర్ రమేష్! నువ్వు చెప్తున్నదంతా వింటూనే ఉన్నాను. మా మీద ఎంతో అభిమానం ఉన్నవాడిలా మాట్లాడుతున్నావ్. నీ డబ్బును పెట్టి నన్ను కొందామనుకుంటున్నావా? నీ డబ్బు నన్ను కొనలేదని మాత్రం తెలుసుకో! లేనిపోనివి కల్పించి నన్ను చులకన చేయాలని ప్రయత్నిస్తే ఏం లాభంలేదు. మా ఫామిలీ మేటర్సుతో నీకేం సంబంధం? ... మోహన రావంటే ఎవరో అనుకుంటున్నావేమో! అతను నీ కన్నా ఎక్కువగా చదువుకున్న ఒక గ్రాడ్యుయేట్. చిన్నప్పట్నుంచి మా యింట్లో పెరిగిన వాడే!

రమేష:-వాడెవడో నాకు బాగా తెలుసును. ఇంత వరకు పట్టుబడని జేబుదొంగలలో ఘనుడు. వాడి ప్రవర్తన లోకవిదితం! ... మాధవరావు గారూ! నేను వెళ్తున్నాను. బాగా ఆలోచించుకోండి — తర్వాత విచారిస్తేలాభంలేదు. [రమేష్ బెదిరిస్తున్నట్టుగాచూసి వెళ్తాడు. ఇద్దరూ అటు వైపు తీక్షణంగా చూస్తారు.]

మాధవ:—ఏమిటమ్మా యిదంతానూ? నువ్వు మోహన్‌తో తిరగడం ఏమి బాగులేదు.

సుశీల:-అప్పుడప్పుడు నేను ఆఫీసునుండి వస్తున్నప్పుడు నా వెంట మోహన్ రావడం నిజమే. అంత మాత్రంచేత నా శీలాన్ని పాడుచేసుకుంటానను కోవడం పొరపాటు.

మాధవ:—నీ శీలాన్ని నువ్వు కాపాడుకోగలవని నాకు తెలుసు... (కోపంగా)... ఆ తుచ్ఛుడ్ని యింటికి రావద్దంటే తోవలు కాస్తున్నాడన్న మాట!

సుశీల:—అప్పుడప్పుడు యింటికికూడా వస్తున్నాడు

మాధవ:—ఆఁ

సుశీల:—నేనే రమ్మన్నాను. ఎప్పటికైనా అతనికి బుద్ధి వచ్చేటట్టు చేయాలని నా ప్రయత్నం.

మాధవ:-అలాచేసి మనవంశ మర్యాదను నాశనం చేస్తున్నావన్నమాట! ఈ సారి వాడు యీ గుమ్మం ఎక్కనీ ..

సుశీల:-మీరు కొంచెం నిదానంగా ఆలోచించండి నాన్నగారూ! మోహన్ చదువుకున్నవాడు. అతన్ని మంచి త్రోవలో పెట్టడానికి మీరూ ప్రయత్నించాలి. అంతేగాని మీరూ లోకంతో కలిస్తే ఎలాగ?

మాధవ:-చదువుకుని అన్నీ తెలిసినవాడు తప్పుత్రోవ పడితే ఎవరేం చేయగలరు? వాడితో నువ్వు

తిరగడంగాని వాడిక్కడకు రావడంగాని మంచిది కాదు. నీ చేతులతో నీ భవిష్యత్తును పాడు చేసుకోకు - నా మాటవిను - నీ మంచికే చెబుతున్నాను.

సుశీల:_అతనిలో ఏనాటికైనా పరివర్తన తీసుకు రావాలని నాకుంది; తీసుకు రాగలనన్న నమ్మకం కూడ ఉంది.

మాధవ:-తేగలిగితే మంచిదే! సంతోషమే! ... నా చెల్లెలి కొడుకు నాకళ్ళముందు యిలా తయారయినందుకు నాకు చాలా కష్టంగా ఉంది...వాడికి చదువు చెప్పించాను. వాడి చదువుకోసమని చాలా అప్పుచేశాను. బుద్ధిమంతుడవుతాడనుకున్నాను. కాని వీడు నా మర్యాద తీస్తాడనుకోలేదు... దొంగతనం చేసి బ్రతక్కపోతే అడుక్కుని తిన కూడదూ?...ఆనీచుడు యింటికివస్తే నేను సహించలేను. వాడిని రానివ్వవద్దు...వాడు నాపరువు మర్యాదా తీస్తున్నాడు.

సుశీల:_దీనంతటికీ ఎవరు కారణం? ఎవరు?... మీరు!

మాధవ:_(కోపంగా) ఏమంటున్నావు? నేనా? సుశీలా నీ యిష్టంవచ్చినట్టూ మాట్లాడుతున్నావు!

సుశీల:_ఉట్టినే ఆగ్రహంవస్తే ఏం ప్రయోజనం? ఇన్నాళ్లుమీరు అతన్ని కొడుకులాగ చూశారు. మీ దగ్గరఉన్నన్నాళ్లు చాలా మర్యాదగా ఉన్నాడు. ...చెట్టును పెంచి అది పళ్లుపండకముందే కోపం వచ్చి దాన్ని నరకినట్టు మీరతన్ని బయటకుపంపించారు. పాసవగానే యీరోజుల్లో ఉద్యోగాలు దొరుకుతున్నాయా! మీరు తొందరపడ్డారు_ బయటకు పంపించారు. నిరుద్యోగుల లిస్టులో చేరాడు-తిండికిగతిలేక తప్పుదారి పట్టాడు.

మాధవ:_అడుక్కుని తినమను.

సుశీల:_ఎడ్యుకేటెడ్ బెగ్గర్సుకు అన్నంపెట్టేదెవరు? అది మాత్రం మీ మర్యాదకు భంగంకాదా? కూలిపనిచేసుకుని బ్రతికినా మీ మర్యాదకు భంగమే.

మాధవ:_అయితే దొంగతనం చెయ్యవచ్చునంటావ్?

సుశీల:_నేను అనను. తప్పుదారిపట్టాడు. అతన్ని మనం మంచి దారిలో పెట్టాలి.

మాధవ:_లాభంలేదు.

సుశీల:_ప్రయత్నించాలి ...ప్రయత్నించి చూస్తాను.

మాధవ:_నీ యిష్టం, నీ ఖర్మం! వాడూ నువ్వూకలసి ఏగంగలో దిగుతారో దిగండి. ... తల్లిలేని పిల్లవని ముద్దుచేసి, పెంచి, పెద్దచేసినందుకు నాకే పాఠాలు నేర్పాలని చూస్తున్నావ్! నీ తల్లే బ్రతికిఉంటే యీ వేషాలు వేశాదానివా? నీ యిష్టంవచ్చినట్టు_నీ ఖర్మం_వాడితోకలసి నువ్వు కూడా పో. [కోపంగా వెళ్తాడు; సుశీల దుఃఖం పట్టలేక 'అమ్మా' అంటూ తల్లిఫోటో దగ్గరకు వెళ్తుంది.]

సుశీల:_[దీనంగా]

ప్రేమాజాలిలేదా?
నా పైనా కరుణేలేదా?
కష్టం నష్టాలేనా - జీవితమింతేనా?
నా జీవిత మింతేనా? ||ప్రేమా||
చిరుతాప్రాయా దినాలే మరిరావా?
నీ కూతురు మాటే చూడ మరచావా?
బీద తనమే - నా పాలిటిదియా?
వ్రాసి పెట్టితివా? అమ్మా దాచీ పెట్టితివా?
నీ ప్రేమే పోయినదా? ||ప్రేమా||

[పాట పూర్తయిన తర్వాత కుర్చీలో కూలబడి విచారంగా ఉంటుంది.]

ప్రకాశ:_[ప్రవేశించి] మాధవరావుగారూ!

సుశీల:_[తన దుఃఖాన్ని, తెలియనివ్వకుండాలేచి] రండి.

ప్రకాశ్:—అద్దె యింకా యివ్వదలచుకోలేదా మీరు?

సుశీల:—ఇప్పుడే గదండీ మీరు వచ్చారు! ... ఒక నెలది యిమ్మన్నారు, యిదిగో తీసుకోండి [యివ్వబోతుంది.]

ప్రకాశ్:—ఒక నెలదీ? ఒక నెలదిస్తే ఏమన్న మాట? పాతబాకీ? మీరు రెండు నెలలది బాకీ, మీరు యిల్లు ఖాళీచేస్తేగాని లాభంలేదు. ఈ నెల అద్దెకూడా మీ వద్దనే ఉంచుకోండి.

సుశీల:—త్వరలో మీ బాకీ తీర్చేస్తాంగాని మీకు యివ్వకుండా ఎక్కడికిపోతాం చెప్పండి!

ప్రకాశ్:—ఇలా మీరు ఆరు నెలలబట్టి చెపుతున్నారు; ఇవ్వలేకపోతే యిల్లు ఖాళీచేసి వెళ్ళండి. ఇంక ఎవరైనా దిగితే అద్దె ఎక్కువ వస్తుంది. [మోహన్‌రావు ప్రవేశిస్తూనే ప్రకాశరావు జేబులోనుండి పర్సు కొట్టేసి, ప్రకాశరావుకు కనబడకుండా నిలబడతాడు.]

ప్రకాశ్:—ఇల్లు త్వరలో ఖాళీచేయాలని నేను చెప్పానని మీ నాన్నగారితో చెప్పు. ఖాళీచేయకపోతే ఖాళీ చేయించవలసి వస్తుందనికూడా చెప్పు.

మోహన్:—[ఎదురుగావచ్చి] ఏమిటండీ సంగతి?

ప్రకాశ్:—నీసంగతికాదు.

మోహన్:—ఆడదాన్నిచేసి ఏమిటో చాలా జోరుగా తమరు మాట్లాడుతున్నారు. తమరు మాటలు కొంచెం తిన్నగా రానిస్తే మంచిది.

ప్రకాశ్:—అద్దె యివ్వడానికి గతిలేదుకాని ...

మోహన్:—కొంచెం ఒళ్ళు దగ్గిర పెట్టుకుని మాట్లాడు మర్యాద తప్పేవంటే మూతి పళ్ళు రాల్తాయి... నీకు అద్దె ఎందుకివ్వాలి? ఈ గుఱ్ఱపుశాలకి సున్నంవేయించి ఎంతకాలమయింది? కిటికీ ఒకటి పెట్టించమంటే మాట్లాడవేం? అద్దె మాత్రం నీకు కావాలీ!

ప్రకాశ్:—నేనేం చేయించను. నీకు యిష్టంలేకపోతే ఖాళీచేసి వెళ్ళు. ఉండమని బ్రతిమాలేనా?

మోహన్:—ఖాళీ చేయించాలనేకదూ ఎలక్ట్రిక్ కనక్షన్ కట్ చేశావ్? ఆ విషయమై యింకా నీ యింటికి వద్దామనుకుంటున్నాను.

సుశీల:—ఎందుకు మోహన్ దెబ్బలాట?

మోహన్:—సుశీలా! ఒక్క దమ్మిడీకూడా వీడికి యివ్వకు, వీడి తాతతో చెప్పుకోమను. నేను పోయి పోలీసుకు Complaint యిచ్చి వస్తాను.

ప్రకాశ్:—ఎందుకు? నేనేం చేశానని? అద్దె అడిగితే తప్పా? రిపోర్టు చేసుకో.

మోహన్:—ఆడది ఒంటరిగా ఉన్నప్పుడు యింట్లో జొరబడి అల్లరిచేయాలని ప్రయత్నించినందుకు. నేను రాకపోతే నువ్వు ఏమయినా చేసేవాడివి!

ప్రకాశ్:—ఇదొకటా? నువ్వు ఎంతపనైనా చేయగలవు! నీకు పోలీసువాళ్ళందరూ తెలుసునని కూడా నాకు తెలుసు.

మోహన్:—నా సంగతి నీకు బాగా తెలుసునుగదా మరి?

ప్రకాశ్:—నేను వెళ్తాను; మీ మామ ఉండగా వస్తాను. నా కెందుకీ లేనిపోని నింద? [పోబోతాడు.]

మోహన్:—ఆగు! వెళ్ళడానికి వీల్లేదు! [ఆపుతాడు.]

ప్రకాశ్:—ఎందుకు? నన్ను పోనీయ్.

మోహన్:—ముందు అద్దె అంతా ముట్టినట్టు ఒక రసీదువ్రాయి. ... ఊఁ ... వ్రాయి. [జడుస్తూ ప్రకాశరావు వ్రాస్తాడు.] ... ఇల్లు త్వరలో బాగుచేయిస్తానని ఒక హామీ వ్రాయి. [జడుపుతోనే అదికూడా పూర్తిచేస్తాడు.] ఇలా యియ్యి.

ప్రకాశ్:—అద్దో!

మోహన్:—భయపడకు; అద్దె యిస్తాలే యిలా యియ్యి. [ప్రకాశరావు యిస్తాడు; పుచ్చుకుని] ఇక వెళ్ళు.

ప్రకాశ:—ఏమిటీ దౌర్జన్యం!

మోహన్:—ఏం బ్లాక్‌లో సంపాదించింది చాలదూ? ... పోనీ తీసుకో; ఇంద. [డబ్బు యిస్తాడు.] ఎలక్ట్రిక్ కనక్షన్ పెట్టించు.

ప్రకాశ:—అలాగేనండి. [సంతోషంతో వెళ్తాడు.]

సుశీల:—నువ్వెందుకు యిచ్చావు?

మోహన్:—వాడిది వాడికిచ్చేశాను.

సుశీల:—అంటే?

మోహన్:—నిన్న వాడు బ్లాక్‌లో సంపాదించింది నేను యిప్పుడే వాడి జేబులోనుండి కొట్టేసి అందులోది కొంచెం యిచ్చేను. ఇదిగో మిగిలినది.

సుశీల:—మాగొప్పపని చేశావ్! ఆ పాపపు సొమ్ములో మాక్కూడా భాగం యిచ్చావన్నమాట!... మోహన్! ఇక్కడకు నువ్వెందుకొచ్చావ్?

మోహన్:—నేను రాకపోతే యీ దుష్టుడు యింకా ఎన్ని కూతలు కూసేవాడో!

సుశీల:—నువ్విలా దొంగతనాలు చేసి బ్రతికినన్నాళ్ళు మా యింటికి నువ్వు రావద్దు.

మోహన్:—రాకుండా ఉండలేను సుశీలా!

సుశీల:—నలుగురిలో నన్ను నవ్వులపాలు చేయాలని ఉందా? ఊళ్లో నలుగురు ఏమనుకుంటున్నారో తెలుసా?

మోహన్:—ఏమనుకుంటే నాకేం?

సుశీల:—నీకు కాదు; నాకు! నీనుంచి నేను ఉద్యోగం మానుకోవలసి వస్తుందేమో!

మోహన్:—ఈ మాత్రానికే! ఒక దగ్గిర బంధువు నీ మేనత్తకొడుకు నీయింటికి వచ్చినంత మాత్రానికే!

సుశీల:—అందుకు కాదు. నీ గుణ గణాలనుబట్టి మాకు చెడ్డపేరు వస్తోంది. మా యిద్దరిపరువు తీయదలచుకున్నావా? ... నువ్వు నాతో మాట్లాడడం నాకు తలవంపులుగా ఉంది.

మోహన్:—సుశీలా! చిన్నప్పట్నుంచి ఒక చోట పెరిగాం. ఒక చోట తిన్నాం; ఒక చోట ఆడుకున్నాం. ఆ చనువుచేత నిన్ను చూడండే ఉండలేకుండా ఉన్నాను. ఇప్పుడు మనం లోకులకు జడవాలా?

సుశీల:—నువ్వు జడవనవసరంలేదు. నేనో! ఆడది ఉద్యోగంచేయడమే పెద్ద తప్పుగా పరిగణిస్తున్న యీ ఊళ్లో మన యిద్దర్నిచూసి నలుగురూ ఊరుకుంటారా? మోహన్ మనం బంధువులమే కాని...

మోహన్:—కాని? ... నేను రావడంగాని; నీతో మాట్లాడడంగాని నీకు యిష్టంలేదు, అంతేనా? ... నువ్వు ఏమన్నాసరే నేను నిన్ను చూడకుండా ఉండలేను సుశీలా!

సుశీల:—(వ్యంగ్యంగా) ఔను ఉండలేవు! దొంగతనం చేయకుండా ఉండలేవు! ఏం... మోహన్ ఎందుకీ బ్రతుకు?

మోహన్:—నిజమే! ఎందుకీ బ్రతుకు? నువ్వు తిరస్కరిస్తే యీ బ్రతుకు వ్యర్థమే!...నీమీద ఆశ కొద్దీ చావలేకుండా ఉన్నాను. నువ్వు ఏం చేయమంటే అది చేస్తాను గాని నన్ను తిరస్కరించకు. నన్ను వివాహమాడతానన్న మాట మరిచిపోకు... ఆ మాటలన్నీ మరచిపోయావా?

సుశీల:—నేను ఏవీ మరచిపోలేదు. నీవు నీ కుటుంబ గౌరవం మరచి పోయావ్. నీవు నీ ప్రవర్తన మార్చుకుంటేగాని నా వాగ్దానము నేను నిలబెట్టుకోలేను.

మోహన్:—నన్ను ఏం చేయమంటావ్? ఎలా బ్రతకను?...

సుశీల:-ప్రస్తుతం నీదీ ఒకబ్రతుకే! నీ బ్రతుకు తెరువు మార్చుకో. ఏదైనా ఉద్యోగం చెయ్యి మర్యాదగా బ్రతుకు.

మోహన్:-నీ Promise

సుశీల:-అదంతా తర్వాత. ఎప్పటికైనా నీలో పరివర్తన కలిగి మర్యాదగా జీవిస్తావని ఆశపెట్టుకున్నాను. అంతేగాని నా Promiseను నేను మరచిపోలేదు.

మోహన్:_నిజంగానా! మరచిపోలేదా?

సుశీల:-నీవంటే నీ చదువు, నీ విజ్ఞానం, నీనీతి, నీ కుటుంబగౌరవం, అన్నీ మరచి పాడయావు ... చిన్నప్పుడు నేను నాన్న జేబులోనుండి ఒక అణా దొంగలాడేనని కోప్పడ్డ నీవు యిప్పుడేం చేస్తున్నావు? క్లాస్‌లో తోటికుఱ్ఱవాడి పెన్సిల్ అన్నయ్యతీశాడని నాన్నతో ఫిర్యాదు చేసిన పెద్దమనిషివేనా నీవు? చిన్నప్పటి నీ సత్ప్రవర్తనలో లవలేశమైనా యిప్పుడు నీకుందీ?

మోహన్:_సుశీలా! నన్ను ఎందుకు ఊరకే ఎత్తిపొడుస్తావు?

సుశీల:-చిన్నప్పుడు నీవు ఎంతనీతితో ప్రవర్తించావో, ఎంత మంచివాడివనిపించుకున్నావో, ఒక్కసారి జ్ఞాపకం తెచ్చుకో. నీ పూర్వ చరిత్రను ఒక్కసారి మననంచేసుకో. ఒక్కసారి నీ ప్రస్తుత జీవితాన్ని నీ పూర్వపు దినాలతో పోల్చి చూసుకో. నీ బ్రతుకు నీకే అర్థమవుతుంది.

మోహన్:-సుశీల! ఇంక నన్ను బాధ పెట్టకు. నేను-

సుశీల:_అయితే వెళ్లు, నీ వృత్తి మార్చుకో! మర్యాదగా జీవించు. B. A. వరకు చదివిన నీ చదువును ఏంచేశావ్? ఎందుకు నీకు యీ పాడు దొంగవృత్తి?

మోహన్:-[సిగ్గుతో]మామనన్ను పోషించలేక నన్ను వేరు పొమ్మన్నాడు. ఉద్యోగం దొరక్క-కడుపు కక్కుర్తికోసం మొదలు పెట్టాను ధన మార్జించడానికి దగ్గిర మార్గమని-దీన్ని వదిలిపెట్టలేకుండా ఉన్నాను.

సుశీల:-అయితే ఉచ్చమూ నీచమూ అంటూ లేదన్న మాట - ఒక్కసారి పట్టుబడి జైలుకు వెళితే నీ జీవితం ఏమవుతుందో గ్రహించావా? అప్పుడు నీ మొహం ఎవరికి చూపించగలవ్?

మోహన్:-ఔను; నా బ్రతుకు నిందలపాలవుతుంది. నన్ను చూసి అందరూ అసహ్యించుకుంటారు. కాని...

సుశీల:-ఇంకా ఆ కానీ ఏమిటి? నిన్నింకా ఆ పిశాచం వదలడం లేదా? నీ మొహం నాకు చూపించకు,... వెళ్లు... (పోబోతుంది)

మోహన్:-సుశీలా! ఆ పిశాచం నన్ను వదలడం కాదు. నేనే ఆ పిశాచాన్నీ వదలదలచుకున్నాను. కాని నాకు ఉద్యోగం ఎవరిస్తారు యిప్పుడు? నా జీవితం ఎలా గడుస్తుంది యిప్పుడు?

సుశీల: నీలో పరివర్తనం కలిగితే చాలు ఉద్యోగం దొరక్కపోతుందా! ఇక్కడ కాకపోతే ఇంకోచోట దొరుకుతుంది. నీకు ఉద్యోగం దొరకే వరకు నేను సహాయం చేస్తాను.

మోహన్:-నిజంగానా?

సుశీల:_నిజమే కాని నీవు పూర్తిగా మారాలి.

మోహన్:-మార్తాను. నిజంగా మార్తాను.—పూర్తిగా మార్తాను. ఇకమీదట దొంగతనంచేయను; మర్యాదగా జీవిస్తాను. నా మాట నమ్ము.

సుశీల:_నీ మాటలు నమ్మవచ్చా!

మోహన్:-ప్రమాణం చేసిచెప్తాను-చెయ్యమన్నావా?

సుశీల:_దొంగ ప్రమాణం చేస్తే చాలదు మనస్ఫూర్తిగా చేసి ఆ చేసిన ప్రమాణం నిలబెట్టుకోవాలి.

మోహన్:-సుశీలా నన్ను యింకా అనుమానిస్తు

న్నావా? నీకోసమని ఏం చేయమంటే అది చేస్తాను. చేసిన ప్రమాణం తప్పకుండా నిలబెట్టుకుంటాను.

సుశీల:_అది తప్పితే?

మోహన్:-తప్పను. ఏ ప్రమాణం చేయమంటే అది చేస్తాను.

సుశీల-ఐతే నేను చెప్పినట్టూ చెయ్యి.

మోహన్:_అలాగే

సుశీల:-"ఈ క్షణంనుండి అబద్ధమాడను, దొంగతనం చేయను, మర్యాదగా జీవిస్తాను. ఇందుకు విరుద్ధంగాపోతే నాకు అతిప్రియమైనది లేకుండా పోగాక!" అని ప్రమాణం చెయ్యి.

[ఒట్టుపెట్టమని చెయ్యి చూపుతుంది.]

మోహన్:_ప్రపంచంలోకల్లా నీవే నాకు ప్రియమైన దానివి నీమీద నా ప్రమాణం?

సుశీల:-ఎవరిమీద చేస్తేనేం? నీవు చేసే ప్రమాణం తప్పదలచుకున్నావా?

మోహన్:_తప్పదలచుకోలేదు. కాని నీ మీద ఎందుకు? నేను పొరపాటుచేస్తే నీకెందుకు హానికలగాలి?

సుశీల:-ఎక్కువ ప్రియమైన దానిమీద ప్రమాణం చేస్తే నిలబెట్టుకోడానికి ఎక్కువ అవకాశాలు ఉంటాయి. శ్రద్ధ ఉంటుంది. కనుక యీ ప్రమాణంచేసితీరాలి. తప్పదు.

మోహన్:-తప్పదా?

సుశీల:_తప్పదు! (మాధవరావుప్రవేశం)

మోహన్:-[కోర్టులోనిలబడినట్టు నిలబడి]"ఈక్షణం నుండి అబద్ధమాడను. దొంగతనం చేయను. మర్యాదగా జీవిస్తాను. ఇందుకు విరుద్ధంగాపోతే నాకు అతిప్రియమైనది లేకుండా పోగాక!"

మాధవ:-తథాస్తు త్వరలో ఉద్యోగస్థుడవై హాయిగా ఉండు నాయనా! నా కంతకన్నా ఏంకావాలి?

మోహన్:-మామయ్యా! సుశీల యివాళ నాకళ్లు విప్పింది.

సుశీల:_కాదండీ! మోహన్ యివాళ కళ్లు తెరచాడు. అతనిలో పరివర్తన కలిగింది.

మాధవ:-నీకు అతి ప్రియమైనది ఏది మోహన్?

మోహన్:-ఇదిగో [సుశీలను చూపిస్తాడు]

మాధవ:_[చిరునవ్వు నవ్వి] ఔనా సుశీలా?

సుశీల:_అని అంటున్నాడు మోహన్ నాకేం తెలుసు?

మాధవ:-[నవ్వుతూ] నీకు తెలియదా? పెళ్లిచేసుకోడానికి నిశ్చయించుకున్నారన్నమాట!

సుశీల:_ఔను; అతనిలో పరివర్తన కలిగింది, కాని యిప్పుడుకాదు. అతను ఉద్యోగస్థుడైన తర్వాత ...మీతో చెప్పకుండా నేను నిశ్చయించుకున్నందుకు క్షమించండి.

మాధవ:_నీ వివాహం నీ యిష్టమని ఎప్పుడో చెప్పాను. మోహన్! చాలా సంతోషం. ఉద్యోగ ప్రయత్నం చెయ్యి నాయనా! [వెళ్తాడు]

మోహన్:_అలాగే మామయ్యా! [అంటూ సుశీలను పట్టుకోబోతాడు]

సుశీలా: [తప్పించుకుని]

ఇదా యిదా నీ బ్రతుకు-నీ డిగ్రీ వృథాగా! ||ఇదా||
చదువు దండుగా? సిగ్గేలేదా? బుద్ధేరాదా? ||ఇదా||
సూట్ బూట్ వేషాలా మోసాలు చేయా?
మాటల డాబులలో - మాయలు చేసే
చదివిన నీ చదువు ఏమైపోయే?
నీ బుద్ధే గడ్డి తిన పోయేనా? ||ఇదా||

(659-వ పేజి చూడుడు)

# 'రాగమయి'

## శ్రీ విజయ - రాఘవ

(గతసంచిక తరువాయి)

సుందరమ్మకు మరింత దుఃఖం పొంగివచ్చింది. రాగమయికి యేంతోచలేదు.

"కష్టాలెప్పుడూ యిలా వుంటాయా అమ్మా! మన మనుకొన్నామా యిలా అవుతామని. అక్కయ్యకు కులాసా చిక్కగానే యేదోవిధంగా కొంత వరకు బాగుపడతాం" అని ఓదార్చింది రాగమయి కొంతసేపటికి.

శ్యామసుందరి పంతులమ్మగావుండి సంపాదించిన పైకమంతా, తన మందులికి, యింట్లో సాదర ఖర్చుకి అయిపోతోంది. ఆ నాటి కానాటికి కష్టాలు గట్టిపడుతున్నాయి. రాగమయి ప్రయివేటు చెప్పడం మొదలు పెట్టింది. సుందరమ్మకు, శ్యామసుందరి జీవితం గుర్తుకొచ్చినప్పుడల్లా "ఎలా పెళ్ళికావడం? యీ రోగం వున్నదాన్ని ఎవరు పెళ్ళిచేసుకొంటారు? యేమిటో యీ కర్మ, ఎంతకాలం యిలా అనుభవించాలో!" యిలాంటి బాధలు రోజు రోజుకి పెరిగి తెగతెంపులు కాకుండా వుండేదికాదుగదా! తెగని గొలుసులా తయారయ్యేది.

రఘునాథం విషయంలో శ్యామసుందరి పూర్తిగా విడిపోయింది. రాగమయికి మాత్రం ప్రతి నిముష నిముషానికి గుర్తుకొస్తున్నాడు. యీ సంగతి శ్యామసుందరికి తెలుసు. అయితే "ఈ సంగతుల్ని గురించి అదే పనిగా ఆలోచించబోకు" అని యెన్నడూ శ్యామసుందరి మందలించలేదు. ఒకటి, రెండుసార్లు రాగమయి, "రఘునాథంకి వుత్తరాలు వ్రాస్తానక్కయ్యా వీలుంటే యేభయ్యో! అరవయ్యో పంపమని" అని అడిగింది. శ్యామసుందరి విలువలేని చిరునవ్వునవ్వి "ఆ విషయంతప్ప మరేదైనా వ్రాయి. నేనంతబాధపడను" అంది.

రాగమయికి ఆ మాట తృప్తిగాలేదు. సుందరమ్మతో ప్రస్తావించింది. "అక్కయ్యేమంది?" అన్నది సుందరమ్మ. శ్యామసుందరి అన్నమాట సుందరమ్మవిన్న తరువాత "ఆ మాటను గురించి యెందుకింకా ఆలోచన. అటువంటి ఆపేక్షలన్నీ అణగార్చుకోవడం మంచిది" అంది. రాగమయి ఆ రాత్రి రఘునాథాన్ని తల్చుకొని వెక్కి వెక్కి యేడ్చింది. సుందరమ్మప్పుడు చాలాసేపు బ్రతిమలాడింది. ఎన్నో సంగతులు యీ పరిస్థితిమీద చెప్పుకొచ్చింది. రాగమయి యేదో తాత్కాలికంగా వూరుకొంది. శ్యామసుందరి జబ్బు నానాటికి తగ్గుస్థాయిలోకి వస్తోందని, సరియైన ఆహారం తృప్తిగా యివ్వాలని కృష్ణమోహన్ చెప్పిననాటిరాత్రి సుందరమ్మ, రాగమయిల హృదయాల్లో ఆనందం చిగిరించింది. కృష్ణమోహన్ యీ మాట చెప్పడానికి తనింటికొస్తాడని యిద్దరూ అనుకోలేదు. కృష్ణమోహన్ మళ్లీ జట్కా యెక్కడానికి వెళ్ళబోతుండగా - రాగమయి దగ్గరగా వెళ్ళి - "డాక్టరుగారూ! యీ బత్తాయి తీసికోండి" - అంటూ చేతుల్లోవుంచి నమస్కారంచేసింది. కృష్ణమోహన్‌కి రఘునాథం జ్ఞాపకమొచ్చి చిరునవ్వు నవ్వుకొని రాగమయి వంక చూస్తూ "ఫరవాలేదులేమ్మా" అన్నాడు. "కాదు డాక్టరుగారూ! మీ మేలు మరిచిపోలేము. యింతకన్నా యిప్పుడేమీ, మీ కిచ్చుకోలేం" అని కంట నీరెట్టుకొంది. కృష్ణ మోహన్ మెల్లగా ఆమె యిచ్చిన బత్తాయిని చూస్తూ "వెళ్లొస్తా రాగమయీ! మీ అక్కయ్యకేం ఫరవాలేదు. నేచెప్పినట్లు మాత్రం చేయండి" అని బండిలో వెళ్ళిపోయాడు.

రాగమయి వోణీ పమిటచెంగుతో కళ్లనీళ్లద్దుకొంది. ఆ మర్నాడు శ్యామసుందరి దగ్గరకు వుత్సాహంతో వచ్చి—

"ఎలావుందక్కయ్యా!" అని అడిగింది.

"డాక్టరుగారేమన్నారు" - అంది శ్యామసుందరి.

"చెప్పినట్లు జాగ్రత్తగా ఆహారం అదీ యిస్తూండ మన్నారు" - అంటూ జరిగిందంతా చెప్పింది. శ్యామసుందరి కళ్లు మూసుకొని కృష్ణమోహన్‌కి నమస్కారం పెట్టుకొంది మనస్సులో. రాగమయి తరువాత యింటికొచ్చేసింది.

ఆ నాడు ఆదివారం. ఆసుపత్రికి సెలవు. కృష్ణమోహన్ ఒంటరిగా కూర్చొని యేదో చదువుకొంటున్నాడు గదిలో. రాగమయి వచ్చినట్లు జవాను తెల్పగానే ఆ పాళానే లేచివచ్చి - "లోపలికిరా రాగమయీ!" అని ఆప్యాయంగా పిల్చాడు. రాగమయి కృష్ణ మోహన్ యింటికిరావడం యిదే మొదటిసారి. ఇల్లు తెలుసుగాని, యిదివరలో యెన్నడూ రావలసినపని కలగలేదు. రాగమయి లోపలికివచ్చి నిలబడింది. కృష్ణ మోహన్ బల్లమీద చేతిలోవున్న పుస్తకాన్ని వుంచుతూ - "నుంచున్నావేమ్మా! కూర్చోక" అన్నాడు.

రాగమయి దగ్గరలోవున్న కుర్చీలో కూర్చొంది. కృష్ణమోహన్ తన మంచంమీద కూర్చొన్నాడు. రాగమయి ఒకసారి మాత్రం అతను తనవైపు చూడకుండావున్న సమయంలో పరీక్షగా చూసింది. ఇంతలో కృష్ణమోహన్-"ఎందుకమ్మా! వచ్చావ్?" అని మృదువుగా అడిగాడు.

రాగమయి సిగ్గుపడి తలవంచుకొంది. ఇంతలో, లోపల్నుంచి కుర్రాడొకడు కాఫీ తెచ్చి రాగమయి ముందుంచాడు.

"తీసుకో రాగమయీ!" అన్నాడు చిర్నవ్వుతో.

"అలవాటులేదండీ!" అంది సన్నగా.

"ఫరవాలేదులేమ్మా! తీసుకో! ఒకసారిత్రాగితే అదే అలవాటయిపోతుంది" అన్నాడు.

రాగమయి మెదలకుండా కూర్చొంది. "సిగ్గుపడుతోందేమో" అని గ్రహించి బయటికి వెళ్ళి అటూ-యిటూ పచార్లుచేయసాగాడు. రాగమయికి కాఫీ అలవాటులేకపోలేదు. అయితే జీవితంలో మార్పులు రావడంతో కాఫీలాంటి విలాస వస్తువుల్ని ఆదరించడం మానేసింది.

కాఫీత్రాగి గాజుబల్లమీద వుంచిన గ్లాసు చప్పుడు వినగానే కృష్ణమోహన్ తాపీగా అడుగులో అడుగు వేసుకొంటూ లోపలికి వచ్చేశాడు.

రాగమయి లేచి నిలబడింది.

"కూర్చో — కూర్చో! లేవడందేనికీ!" అన్నాడు. రాగమయి కొంచెంసేపు నిశ్శబ్దంగా కూర్చొనివుంది. కృష్ణమోహన్‌కి ఎందుకొచ్చిందో తెలుసుకోవాలనిపించింది. రాగమయిని ఆస్పత్రిలో చాలాసార్లు చూశాడుగాని, యీ రోజునవున్న రూపంలో చూడలేదు. మనిషి తేటగా — కష్టాల్లోంచి గట్టెక్కిన దానిలా కనిపించి "యీ అందాన్ని యింతకాలం యెక్కడ దాచివుంచుకొన్నావ్" అనే భావంతోచేలా కృష్ణమోహన్‌కి ఆశ్చర్యం కల్గించింది. సిగరెట్ ముట్టించుకొంటూ — "ఏదో పని మీద వచ్చావనుకొంటాను" అన్నాడు. రాగమయి వంచినతల యెత్తింది.

కృష్ణమోహన్ మామూలుగానే చూశాడు. రాగమయికి మాట్లాడుదామనిపించింది.

"ఒకసారి అక్కయ్య! మీ దగ్గరకు వెళ్ళి కనబడి రమ్మంది. అందుకొచ్చా" అంది.

"నా దగ్గరకా! ఎందుకూ!" అన్నాడు.

"ఇది ... ... యిచ్చి రమ్మంది" అని కుర్చీ లోంచి లేచి వెళ్ళి కృష్ణమోహన్‌కిచ్చి నిలుచుంది.

"ఏమిటిది?" అని దానిని పరిశీలించిచూశాడు. విప్పకుండానే అదేమిటో గ్రహించాడు.

"ఎందుకమ్మా! యింతశ్రమ. యిదేదో తన వద్దే వుంచుకోమన్నానని చెప్పు. ఫరవాలేదులే, నేనేమీ అనుకొనేవాణ్ణిగాదు. పైగా నా సొంత మందులేవీ వాడలేదు. రోగులు బీదవాళ్లై, రోగాలతో బాధపడుతూంటే, డాక్టర్లు సహాయపడకపోతే పరులెవరాదరిస్తారు! భగవంతుని దయవల్ల అందరం

బాగుండాలిగాని, లాంఛనాలు పుచ్చుకొంటే వచ్చే లాభాలేమున్నాయి" అంటూ కృష్ణమోహన్ చెప్పబోతూండగా – రాగమయికి ఆనందం కట్టలు తెగి పొర్లింది. ఇంతలో కృష్ణమోహన్ లేచి ఆ కవరు రాగమయిముందువున్న బల్లమీద వుంచుతూ "జాగ్రత్తగా మీ వద్దే వుంచుకోండి! దీనికింత శ్రమపడి రావాలా" అని చిరునవ్వు నవ్వుకొన్నాడు.

రాగమయికి "ఎంత మంచివారు డాక్టరుగారు" అనిపించింది హృదయంలో.

కృష్ణమోహన్ సిగరెట్టుపొగ వొదుల్తూ – "జాగ్రత్తగా ఆహారం తీసుకొంటోందా అక్కయ్య" అని అడిగాడు.

రాగమయి వెడదామనే అభిప్రాయంతో లేచి "ఆ..." అంది.

కృష్ణమోహన్ అదికనిపెట్టి "వెడతావా"! అని అడిగాడు.

"అవునండీ!" – అంది రాగమయి.

"అయితే మీతో ఒక్క విషయం అందామనుకొంటున్నాను." అన్నాడు.

"ఏమిటీ?" అన్నట్లు చూసింది.

"కృష్ణమోహన్ కూడా లేచి —

"వీలయితే ఒక్కసారి మీ అమ్మగార్ని రమ్మన్నానని చెపుతారా!" అన్నాడు.

రాగమయికి ఆమాటచెప్పడం తేలికనిపించింది— "అలాగే చెబుతానండీ! యివాళే రమ్మంటారా!" అని అడిగింది.

"వీలయితే ..."అన్నాడు క్లుప్తంగా —

రాగమయి "అట్లాగేనండీ" నంటూ కవరు చేత్తో బట్టుకొని యింటి ముఖం పట్టింది —.

## 8

సుందరమ్మ సంసారం వెళ్లిన రెండునెలలకు రాఘునాథం యింటికి తాళంవేసి, భూమి కవులు కిచ్చి ఉద్యోగనిమిత్తం వెళ్లిపోయాడు. ఆరు నెలలు అయినా రఘునాథం సుందరమ్మకు వుత్తరం వ్రాయలేదు. సుందరమ్మగాని, శ్యామసుందరిగాని, రాగమయిగాని, రఘునాథంగురించి మాటలసందర్భంలో అనుకోవడమేగాని, అతని క్షేమ సమాచారాలు తెలుసుకోవాలనే యిచ్ఛలో లేరు. మనస్సులో అయితే వుంది. కాని బంధువులు — లోకంవంక చూసి జడిసిపోవలసి వస్తోంది.

రాగమయి రఘునాథాన్ని తల్చుకోకుండా అన్నంతినదని సుందరమ్మకూ తెలుసు — శ్యామసుందరికీ తెలుసు. ఒక్క సంవత్సరం అయ్యేటప్పటికి రఘునాథం దృష్టి వుద్యోగంలోకి బాగా చొచ్చుకుపోయింది. యితరంగా ఆలోచించవలసిన విషయాలేమీ అతనికి పట్టుపడటంలేదు. బొత్తిగా అధ్యాసే పోయింది. రాగమయి తలపుకొచ్చిన రోజు ఒక పండుగ గావుండేది. ఆరోజున ఆఫీసుకి సెలవు పెట్టేద్దామా! అనిపించేది. వెంటనే తను పడుతున్న ఆనందాన్ని గురించి వుత్తరం వ్రాసేద్దామా! అనిపించేది. కాని అంతలో మనసు యిష్టపడేదిగాదు. "ఏ మొగం పెట్టుకొని వ్రాస్తాను" అని అనిపించేది. "వివాహం కాకుండా యింత కాలం ఎందుకువున్నావని నలుగురయిదుగురు స్నేహితులు గుచ్చిగుచ్చి అడిగారు ఆఫీసులో ఒకసారి. అప్పుడు వాళ్లకేమీ సమాధానం తృప్తిగాచెప్పలేక పోయాడు రఘునాథం.

"చేసిన సహాయాలన్నీ మరిచిపోయిందా సుందరమ్మ" అని ఒకసారి సెలవురోజున బాధగా ఆలోచించుకొని ఖేదపడ్డాడు. అంతలోనే నాలిక్కొరుకున్నాడు "నేను యిలా వుద్యోగం చేస్తూన్నానని యే కొద్దిమందికో తెలుసునని" రఘునాథం వూహించాడు. 'రాగమయి'కూడా తనంటే యింత విముఖత యెందుకు చూపుతోందో అర్థంకాలేదు.

తల్లినిగాని, అక్కయ్యనిగాని యెదిరించే మనస్సు రాగమయిదిగాదు. తన్నుగురించిన విషయాల్ని బ్రతికినంత కాలం తెలుసుకోకుండా వుండాలని, నా యీ బాంధవ్యాన్ని పూర్తిగా విడనాడుకోవాలని సుందరమ్మత్తయ్య శ్యామసుందరి అనుకొంటే అంతగా బాధ వుండదు. రాగమయి మాత్రం మనస్ఫూర్తిగా అనుకొంటే యిక బ్రతికి ఎవర్ని వుద్ధరించడం? ఇది ప్రబలితే ప్రాణాల్ని కూడా తీయగలదు. చివరకు మూడు సంవత్సరాలూ యిలాంటి పరిస్థితుల్లో సతమతమవుతూనే జీవితాన్ని గడిపాడు రఘునాథం.

నాల్గో సంవత్సరంలో రఘునాథానికి 'శుభలేఖ' ఒకటి అందింది. ఒక్కసారిగా ఆశ్చర్య పడ్డాడు. "పెళ్లికి వెళ్లడం అనేది మానేదా!" అనేది బాగా ఆలోచించాడు. వెళ్లకపోతే తన్ను నిందించబడడానికి బలమైన కారణాలు లేవు. శ్యామసుందరి తా లేదనుకొన్నా అంత బాధ లేదు. కాని సుందరమ్మ అనుకొంటే మాత్రం ద్రోహంచేసినవాడినవుతాను. రాగమయి తప్పకుండా మొగంచాటుచేస్తుంది. పరిస్థితులప్పుడు మరోరూపంలో విషమిస్తాయి. ఏం చేయడం? కర్తవ్యం మరియెలా! కాని సంతోషం వేసింది. "శ్యామసుందరి బ్రతికి బాగుపడింది. యిక సుందరమ్మ సంసారం బాగుపడినట్లే" అని గడచిన మూడుసంవత్సరాల్లో తనకూ – సుందరమ్మ సంసారానికి రొటువంటి బాంధవ్యం పెరక్కపోగా, హఠాత్తుగా శ్యామసుందరి పెళ్లికి రమ్మనమని శుభలేఖ రావడంలో యేదో విపరీత పరిణామం వచ్చిందని రఘునాథం నామ మాత్రంగా వూహించాడు. బయలుదేరదామనుకొన్నాడు. కాని మనస్సుయెందుకో వెళ్లొద్దని వారించింది. కటిక్కున అనుకున్న ప్రయాణం ఆపుచేసుకొని పిచ్చిగా తనలో తాను నవ్వుకొన్నాడు. అందులో అంతరార్థం ఆగది నాలుగ్గోడలకే తెలియాలి.

(సశేషం)

# వాళ్ళనలా వదిలేద్దాం

శ్రీ శేమాని సంగమేశ్వరరావు



1

తన గదిలో కూర్చొని "ప్రోబ్లముస్" "సాల్వ్" చేస్తున్నది "దమయంతి." దీర్ఘంగా ఆలోచిస్తూ చేస్తున్నాదేమో అందులో లీనము అయిపోయినట్టుగావుంది. సూర్యాస్తమానపు అరుణ కిరణాలు ఆమె ముఖంమీదపడుతూ అదోలా మెఱుస్తున్నాయ్! ముంగురులు ముఖంమీద కొంచముగాపడుతూ అదో అందాన్ని ముఖానికి తెస్తున్నాయి!

ఆవులిస్తూ బద్ధకంగా ఒక మాఱు ఒళ్లు విరిచింది దమయంతి. పుస్తకాలుసర్ది పైట సర్దుకొనిలేచింది. పుస్తకాలు "షెల్ఫ్"లో పెట్టింది. ఈజీఛైరు మేడమీది ఉత్తరపు కిటికీ కెదురుగాలాక్కొని దానిమీద మేను వాల్చింది కిటికీలోంచిచూస్తూ

ఉత్తరపుదిక్కు కిటికీ దగ్గర కూర్చొని చూస్తే, రోడ్డు - రోడ్డుమీద దట్టంగా తిరుగుతున్న జనం, వాహనాలరొద ... గజిబిజిగా వుంది!

అసలు ఏకాంతము కోరేదీ, ఎల్లప్పుడూ అంతులేని ఆలోచనలతో రోజులు గడిపేదీ దమయంతి! అందుచేత ఆ రోడ్డుమీది వాతావరణం ఆమెకు ఏమీ ఆహ్లాదము కలిగించలేకపోగా, ఒక విధమయిన అయిష్టతను కలిగించింది.

లేచి కుర్చీని స్థలం మార్పు చేసింది. పశ్చిమపు కిటికీ దగ్గరకు కుర్చీలాక్కొని "షెల్ఫ్" దగ్గరకువెళ్ళి చేతికి వచ్చిన పుస్తకం తీసింది. కుర్చీలో మేనువాల్చి, పుస్తకం వొళ్లో వేసుకొని కిటికీలోంచి చూస్తున్నది.

కిటికీలోంచిచూస్తే ఎదురుగా కొన్ని మేడలు, కొన్ని డాబాలు సమానమయిన ఎత్తులో వున్నాయ్! అక్కడక్కడ కొబ్బరిచెట్లు, వాటి ఆకులసందులలోంచి అస్తమిస్తున్న సూర్యుడు ... అదోలా దమయంతి మనస్సును కొంచం ఆకర్షించినాయ్!

పుస్తకం పేజీలు త్రిప్పడంమానేసి ఏదో మనస్సులో తలుచుకుంటున్నాది.

"జానకికి అప్పుడే పెళ్లి అవడమే కాకుండా ఒక ఆడపిల్లకూడాను! ఇంత చిన్నవయస్సులోనే సంసారం...పిల్లలు... బాధలు ... అయినా జానకిలో ఈ దిగులు గాని, ఈ విచారంగాని వున్నట్టు కనిపించవు! చీకు చింతాలేకుండా నిర్విచారంగా జీవిస్తున్నట్టు కనిపిస్తున్నది. పెళ్ళయిన

తరువాత జానకి కళ్లల్లో ఒక విధమయిన వింత కాంతి రావడం తను చూసింది!

పెళ్లికి తనూ వెళ్లింది. అక్షతలు చల్లుతూ అందరిలాగానే తనూ ఆశీర్వాదాలు చేసింది. అయితే మనసులో మాత్రం దమయంతికి జానకి పెళ్లి చేసుకోవడం ఎంతమాత్రం యిష్టంలేదు! ఇప్పటినుండి ఈ సంసార నరకంలో పడిపోతున్నాది అనే బెంగ దమయంతికి పట్టుకుంది - జానకికి లేకపోయినా!

పెళ్లయిన కొత్తలో జానకి పతీ సమేతంగా తన యింటికివచ్చి తన భర్తను పరిచయంచేసింది! అతని ముఖంలో కొంచము క్రౌర్యము కనబడుతూంది. చిన్న విశాసం, ఎగదువ్వడు క్రాపింగు ... పేరు విశాలరావు! పేరుకేం బాగానేవుంది! మనిషి మాత్రం తనకి నచ్చలేదు! ఎందుకో అతన్ని చూడగానే ఒక విధమయిన విముఖత్వం తనకి కలిగింది! ... అప్పుడే నవ్వుకుంది. బాగుంటేనేం? బాగులేకపోతేనేం? తనకెందుకు? కాపరం అతనితో చేస్తున్నది జానకికాని తాను కాదుకదా! అయినాజానకి మాత్రం యివేమీ పట్టించుకోకుండా సంతోషంగా, గర్వంగా, ఏదో ఎవరికీపట్టని అదృష్టం తన ఒక్కతెకే కలిగినట్లు భావిస్తూ తన పతిని పరిచయంచేసింది.

తనూ పెళ్ళిచేసుకోవాలి! చేసుకోవడం తను మానివేసినా లోకం పూరుకోదు! తనకి పెళ్ళిచేసి తీరుతుంది. ... అంతవరకూ ఎందుకు? రోజూ తన తల్లి ఒకటేపోరు తన పెళ్లిని గురించి! తన తండ్రి మాత్రం చాల గంభీరుడు. ఏ విషయములోనయినా చప్పున తేలిపోడు. తన తల్లిది మాత్రం కొంచం బోళా మనస్థత్వం! కష్టంలోగాని సుఖంలోగాని యిట్టే బయట పడిపోతుంది. మళ్ళా తన అన్నయ్యదీ సరిగ్గా తల్లి మనస్థత్వమే! ప్రతీదానికి కసురుతూ చిరాగ్గావుంటాడు. ప్రతి గుణం అతనిలో అతిగా వున్నాయ్!

తనకి తండ్రిపోలిక వచ్చింది అనుకుంది. మళ్లా తన ఈ తలంపులకు తనే నవ్వుకుంది.

ఇంతసేపూ తను సులువుగా ''సాల్వ్'' చేసిన ''ప్రోబ్లమ్స్''లాగ కాకుండా తనకి ఇప్పుడు ఒక ''అన్‌సాల్వ్‌డు ప్రోబ్లమ్'' వచ్చిపడ్డది!

''వివాహమాడడమా? లేక మానడమా? ఆడితే ఎవరిని చేసుకోవాలి? ఈ ప్రశ్నలకు నిజంగా పందొమ్మిదివేళ్ల వయస్సులోవుండి II year-arts చదువుతున్న దమయంతే తేల్చి చెప్పలేకపోయిందంటే దమయంతిలో ఒక విధమయిన ''బలహీనత'' (Weakness) వుందన్నమాట.

జానకిపెళ్లి ఇట్టె నిశ్చయింపబడ్డాది! అట్టె జరిగిపోయింది! ఓకమారు మాత్రం

వరుని చూసింది. అంగీకారం చూపింది! అంతే!

ఒక్క జానకేయేం? తన స్నేహితురాండ్ర పెండ్లిండ్లు తను చాలా చూసింది. అన్నీ ఇలాగ జరిగినవే! కాని తను ఒక్కతా మాత్రం ఏదారికీ రాలేకపోతున్నాది. ఏం! వాళ్లందరూ హాయిగా జీవించలేదా? తనూ వివాహం చేసుకుంటే అలాగే హాయిగా జీవించగలదేమో!

ఏమో? ఎవరు చెప్పగలరు? పెళ్లయిన తరువాత కష్టాలపాలైనవాళ్లు, భర్తలచేత తిరస్కరింపబడ్డవాళ్లు, ఆత్మహత్యలు చేసుకున్నవాళ్లు ఎంతమందిలేరు! అయితే పెళ్లి అయిన తరువాత అది ఎలా పరిణమిస్తుందో ఏంచెప్పగలం? ప్రతీదీ మనకి చెప్పిరాదుగా!

"జీవితాన్ని సుఖమయంగాగాని దుఃఖమయంగాగాని చేసుకోవడం వాళ్లమీదే ఆధారపడి వుంటుంది" అని నిర్వచనం చెపుతూ వుంటుంది జానకి. ఎలాగయినా జానకి అదృష్టవంతురాలు."

చీకట్లు నలుపక్కల వ్యాపించేయి! అక్కడక్కడ మేడగదుల్లో ఎలక్ట్రిక్ దీపాలుకూడా వెలిగేయి!

ఈ భావాల్లో పడిన దమయంతికి చీకట్లో కూర్చోడం కొంచం భీతి కలిగించింది. బద్ధకంతో లేచి "స్విచ్" వేసింది. గది ప్రకాశవంతంగా వెలుతురుతో వెలిగింది. పుస్తకం టేబిలుమీదపడేసి తల సర్దుకుంటూ అద్దంలో తన ప్రతిబింబం చూసుకుంది! దమయంతి ఒక విధంగా అందకత్తే! అయితే ఆవేళ తన ప్రతిబింబం తనకే అంత బాగా వున్నట్టు కనిపించలేదు. కళ్లు లోతుకు వెళ్లిపోయి, కాంతులు తప్పేయి. ముఖం వాడివుంది!

దువ్వెనతో ముంగురులు కొంచం సర్దుకుంది. పౌడరు డబ్బామూత తెఱచింది. మళ్లా ఏమనుకుందో దాని మూత పెట్టి యథాస్థానములో దానిని వుంచేసింది!

ఎందుకో ఇవాళ కాలగమనం వడి తగ్గినట్టు భ్రాంతి పొందింది దమయంతి! ఎల్లప్పుడూ ఏకాంతము కోరే దమయంతికి ఇవాళ ఏకాంతము మీద ఏవగింపు కలిగినట్టయింది! ఏదో తనలోనే మథనపడసాగింది. కాలకూటంలాగ భావాలు బయటకూరావు! లోలోపల జీర్ణంకావు!

పక్కనేవున్న "ఫిడిల్ కేస్" క్లిప్పులు తీసి తెఱచింది. ఫిడిల్ బయటకు తీసింది. తీగెలు ఒక్కమాటు చేతితో సన్నంగా మీటింది. పయిట చెంగుతో దాని ధూళి దులిపింది. ఇవన్నీ తనకి తెలియకుండానే జరిగిపోతున్నాయి! 'కామాను' తీసి ఒక్కమాటు దాని తీగెలమీద గీసింది. అపస్వ

రాలు వస్తున్నట్టువున్నాయి! యథాస్థానములో ఫిడేలు వుంచింది. లేచి మెట్లుదిగ నారంభించింది కిందికి రావడానికి.

తల్లి వంటలక్క ఎమిటో మాట్లాడుతున్నారు. మూడు రోజులు శలవు అడుగుతోంది వంటలక్క తల్లిని! విశ్వేశ్వరరావుగారి అమ్మాయికి వివాహమట! —

తల్లి "ఎలాగు? వీలులేదు! నేను ఈ పనిఅంతా చేసుకోలేను"అని అంటున్నాది.

ఆఖరి మెట్టు దిగుతూ బాల్కనీగోడ పట్టుకొని ఆగిపోయింది దమయంతి. విశ్వేరరావుగారి అమ్మాయి అంటే తన క్లాసుమేటు రమణమ్మ అన్నమాట. బాగుంది! రమణమ్మకి వివాహమా! తనకి ఇప్పటినుండి పెళ్లి వద్దు అని ఎన్నో ప్రగల్భాలు కొట్టిన రమణమ్మ పెళ్లికి ఎలావప్పుకుందో? ఇంట్లో తల్లిదండ్రులను ఎదిరించే బలం లేకపోయింది కాబోలు!

అయినా ఈ తల్లి దండ్రులు కొన్ని విషయాలలో మంచిగావున్నా కొన్నిటిలో మాత్రం కర్కోటకులుగా తయారవుతారు! పిల్లలు పెళ్లిచేసుకుంటేనేం? లేకమానితేనేం? ఎవరిని చేసుకుంటేనేం? అని వూరుకోరు. ఒకటేపోరు!

రమణమ్మకి పెళ్లి అని తనకిప్పుడు వంటలక్క మాటలవలన తెలిసింది.

"ఇన్విటేషను" ఇవాళో రేపో పంపుతుందన్నమాట. తనకీ రేపో మాపో పెళ్లి అవుతుంది. ఆగుతుందా? దమయంతి కళ్లఎదుట తన వివాహము"ఇన్విటేషన్ కార్డు" ప్రత్యక్షమయింది! ఒక అరసెకండు తను తన భర్త ప్రక్కన నిలబడ్డట్టు భావించింది.

బాగున్నాయి తలంపులు! అవుతుందో మానుతుందోగాని అయినట్టే తను తలుస్తున్నాది. తనలో చిరునవ్వునవ్వుకుంది. దిగివెళ్లి తల్లి ప్రక్కన సోఫాలో మౌనంగా కూర్చుంది!

"మూడు రోజులకంటె ఎక్కువవుండకు! నేను చేసుకోలేను. రేపటినుండి వెళ్లు"అని అన్న తన తల్లి మాటలకు అంగీకారం చూపుతూ వంటలక్క వంటింటిలోకి నడిచింది.

"ఏమమ్మా!అలా నిరుత్సాహంగా వున్నావ్"? అని ప్రేమతోతన తల నిమురుతూ తల్లి అడిగింది.

ఒక్క నిముషం మౌనంగా వూరుకొని "ఏంలేదమ్మా" అని జావాబు యిచ్చి దమయంతి లేచి టేబిలు దగ్గరకు వెళ్లింది. రేడియో స్విచ్ ఆన్ చేసింది. తల్లి తనపక్క అదోలా చూసి వంటింటిలోకి వెళ్లడం గమనించింది దమయంతి.

త్యాగరాజ కీర్తన రాగ, తాళ భావయుక్తముగా పాడుతున్నాడు రేడియోలో

ఎవరో గాయకుడు. ఇంకొక దినమయినా, ఇంకొక "మూడ్"లోవున్నా విని ఆనందించ గలిగేది. ఇప్పుడు అది తన్ను ఆకర్షించ లేకపోగా చెవులకు కఠోరంగా వినిపించ సాగింది! రేడియో "ఆఫ్" చేసేసి హాలులో అటు యిటూ పచారు చేస్తున్నది! ఎదురుగాగోడకు మేనక విశ్వామిత్ర పఠము కనిపించింది! ఒక్కమాటు పఠము దగ్గర నిలబడి వెంటనే అక్కడనుండి కదిలి సోఫా వద్దకు వచ్చికూర్చుంది.

అన్నయ్య టెన్నిసు రేకటుతో వడి వడిగా ప్రవేశించి "ఏంచెల్లాయ్"అంటూ పలుకరించి జబాబు ఆశించకుండానే మేడ మెట్లు ఎక్కి తనగదికి వెళ్లసాగేడు. అతడు మేడమెట్లు అన్నీ ఎక్కేవరకు అటు చూస్తూ అప్పుడు తన దృష్టిని మార్చింది దమయంతి!

"నమస్తే యంతీ!" అంటూ వుత్సాహంగా తనక్లాసుమేటు రమణమ్మ ప్రవేశించింది. బండిల్‌లో వున్న తన పేరుగల యిన్విటేషను కార్డు బయటకు తీసి యిచ్చి కుర్చీలోకూలబడ్డది!

కవరు విప్పిచూచింది దమయంతి. వరుని పేరు రమాపతి అట...వివాహం ఇంకా నాలుగురోజులు వుందని గ్రహించింది.

"కన్‌గ్రాచులేషన్స్" అంది దమయంతి నీరసంగా, లేని ఆనందము తెచ్చుకుంటూ!

"అదేమిటే అలావున్నావ్? అప్పుడే నల్ల భై వెళ్లవృద్ధలా తయారయ్యావ్? ఏం! వంట్లో బాగులేదా?" అంది రమణమ్మ.

"ఒంట్లో బాగానే వుందే! ఏం అలా అడిగేవ్?"

"నీ ముఖం చూస్తే పదిలంకణాలు చేసినట్టు కనిపిస్తున్నావ్? ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూనే వుంటావ్? ఎందుకే అంత ఆలోచన"

"నీగురించేనే?"

"ఏమిటీ! నాగురించా?"

"అవునే."

"నాగురించి అంతదీర్ఘంగా ఆలోచించ డానికి ఏముందే?"

"అదే! నువ్వు నాతో క్లాసులో అన్న మాటలకీ, ఇప్పుడు నీవుచేస్తున్న చేతలకీ!" షాక్ తిన్నట్టు ఫీలయింది రమణమ్మ.

"నేనేంటన్నానే క్లాసులో?"

"అదే! వివాహం ఇప్పటినుండీ చేసుకో నన్నావుకదూ ... చదువు పోతుంది... ఇంకా ఏవేవో చెప్పేవే! అవి అన్నీ ఇప్పుడేమిటయ్యాయా అని —"

లేనినవ్వు తెచ్చుకుంటూ యిలా అంది రమణమ్మ. "పిచ్చిదానా! అన్నవన్నీ చెయ్యగలమా చెప్పు? మొన్ననాన్నగారు

నాకు వివాహము చేస్తానని అన్నారు ... ఇప్పటినుండీ వద్దు, చదువుపోతుంది...అని అన్నాను. అయితే వింటేనా? ఆమార్నాడే నన్ను స్కూలు మానిపించేరు ... ఆనాడే నన్ను చూసేందుకు ఎవరో వస్తారని అమ్మ నాన్నా చెప్పేరు'' —

...ఆగింది దమయంతి వింటున్నాదో లేదో అని.

''చెప్పు, చెప్పు... '' అంది దమయంతి.

''అతను వచ్చేరు ఆవాళే ''!

''ఎవరే ? ''

''అతనేనే ...... ఆయన'' ...... సిగ్గు పడ్డది !

''ఓహో నీకు కాబోయే భర్తగారా! ''

సిగ్గుతో ''పోదూ ! నువ్వు మరీని ... ఆయననన్ను చూసేరు ... నేను ఆయనను చూసేను... ''

(సశేషము)

—(౦)—

## గృహోపయోగాలకు సూర్యరశ్మి వినియోగం

వేడిప్రాంతమైన ఉజ్బెకిస్తాన్ పరిశ్రమలలోనూ, దైనందిన జీవితంలోనూ సూర్యరశ్మి మున్ముందు ఎక్కువగ వినియోగింపబడుతుంది. తాష్కెంట్‌లో సోవియట్ విజ్ఞాన శాస్త్ర పరిషత్తుకు చెందిన ప్రయోగ సూర్యరశ్మి సాంకేతిక కేంద్రంలో వివిధరకాల సూర్యరశ్మి యంత్రాలు డిజైన్ చేయబడ్డాయి, పరీక్షింపబడ్డాయి. సూర్యరశ్మి సాయంతో స్వల్పవ్యవధిలో మూడుపంటలతో భోజనం వండడానికి వీలుగా ఒక సులువైన, సౌకర్యవంతమైన పొయ్యి తయారు చెయ్యబడింది. ఇది టెస్టుచేయబడి, ఎక్కువగా ఉత్పత్తి చేయడానికి పరిశ్రమల కివ్వబడింది. సూర్యరశ్మితో పనిచేసే బాయిలర్ (నీళ్లుకాచుకోడానికి), షవర్ బాత్ కూడా టెస్టులలో నెగ్గేయి. ఈ యంత్రాలుకూడా ఎక్కువగా ఉత్పత్తి చేయబడతాయి.

పవర్ ఇంజినీరింగ్ విద్యాసంస్థలో పోస్టుగ్రేడ్ విద్యార్థి క్లిచ్‌టగయేవ్ ప్రయోగ సూర్యరశ్మి సాంకేతిక కేంద్రంలో ఆసక్తి జనకమైన పరిశోధనచేశాడు. రిఫ్రీజిరేటింగ్ కోసం సూర్యరశ్మి వినియోగంపై ఒకసిద్ధాంతవ్యాసం రచించాడాయన. సూర్యరశ్మితో పనిచేసే ఒక రిఫ్రీజిరేటర్ (ఇంటిలోవాడు కునేది) ను డిజైన్‌ను గురించి అందులో వ్రాశాడు. అది సులువైన యంత్రం. ఆర్థికంగా లాభదాయకం కూడాను. ఎండ కాసేరోజులు ఎక్కువగావుండే మధ్య ఆసియా రిపబ్లిక్కులలోని ప్రజలలో దీనికి గిరాకీ బాగావుంటుంది.

(648_వ పేజి తరువాయి)

బ్రతుకు కడుహీన మవగరాదోయి
ఊరు ఊరంతా నీ మాటలేనోయి.
వింత వింత కథలు ఎన్నో అల్లేరోయి.
బావమారవోయి ! చాల మంచిదోయి ॥ఇదా॥

మోహన్:-మారేనుగా !

సుశీలా:-చాలా మంచిదోయ్ ! (నవ్వుతుంది)

మోహన్:-[పట్టుకోబోతాడు.]

సుశీల:-(తప్పించుకుని) ఆగు. ఇదేనా మర్యాద ?

మోహన్:-ఏం ?

సుశీల:-పరాయిదాన్ని ముట్టుకోవచ్చునా ?

మోహన్:-నువ్వు నా దానివేగా ?

సుశీల:-నీకు ఉద్యోగం అవాలి తర్వాత మనిద్దరం వివాహం చేసుకోవాలి అంతవరకు నీ దాన్ని కానని తెలుసుకో.

మోహన్:-అంతవరకు నీ అధీనంలో నన్నొక సేవకుడుగా ఉంచుతావు కాబోలు !

సుశీల:-కాదు స్నేహితుడుగా.

(తెర)

(సశేషము)

# మీ క్రొత్త నాణ్యాలు




## 1957-వ సం॥ ఏప్రిల్ 1-వ తేదీ లగాయతు.

ఇప్పుడు చెలామణీలో ఉండు నాణ్యాలు, కొత్త నాణ్యాలు—ఇవి రెండూ కొనుగోలు-అమ్మకపు బేరాలకై డబ్బు చెల్లించుకోడానికి చెలామణీ అవుతాయి. ఈ రెండు నాణ్యాలలో ఏదిచ్చినా సరే, ఎవరూ కాదు కూడదనలేరు.

పరివర్తన పథకంలో ఉన్న మౌల్యానికి పైబడి మీరు ఇవ్వనూరాదు, ఇమ్మని అడగనూరాదు. మీ రిచ్చుకోవలసిన సొమ్మును ఇప్పుడు చెలామణీలో ఉండు నాణ్యాలతోనో, క్రొత్తవానితోనో, లేక మీవద్దనున్న నాణ్యాలనుబట్టి, ఆ రెంటినీ కలిపి కూడా చెల్లించుకోవచ్చు.

- మీరు మీ బేరంలో అఖరు సారిగా సొమ్మును చెల్లించు నప్పుడే ఈ పరివర్తన పథకాన్ని చూచుకొనండి.
- లెక్కలు సరిచూచుకొను సందర్భంలో మీరు ఒకరూపాయి, లేక **16** అణాలు, లేక **64** పైసలు, లేక **192** దమ్మిడీలకు **100** నయా పైసాల రేటు చొప్పున లెక్కించుకొనండి.

పరివర్తన పథకంలో సూచించినట్లు పూర్ణాంకమునకు తెచ్చు అవుసరం అఖరుసారిగా సొమ్ము చెల్లించునప్పుడే వస్తుంది. $\frac{1}{2}$ నయా పైసా లేక అంతకంటే తక్కువ చిల్లరను విడిచి వేయాలి. $\frac{1}{2}$ నయా పైసా కంటే ఎక్కువను ఒక నయా పైసాగా లెక్కించుకోవాలి.

DA-56/122



### *సులభంగా జ్ఞాపకం ఉంచుకొనండి*

| | | | | |
|---|---|---|---|---|
| 1 రూపాయికి | ... | ... | 100 | నయా పైసాలు |
| 8 అణాలకు | ... | ... | 50 | నయా పైసాలు |
| 4 అణాలకు | ... | ... | 25 | నయా పైసాలు |
| 3 అణాలకు | ... | ... | 19 | నయా పైసాలు |
| 2 అణాలకు | ... | ... | 12 | నయా పైసాలు |
| 1 అణాకు | ... | ... | 6 | నయా పైసాలు |
| $\frac{1}{2}$ అణాకు | ... | ... | 3 | నయా పైసాలు |

# పరివర్తన పథకము

(ఏ ఒక్క సారికైనా అచ్చుకోవలసిన సొమ్ము మౌల్యమునకైనా సరిపోతాయి.)

| అణాలు | పైసలు | నయా పైసలు | అణాలు | పైసలు | నయా పైసలు | అణాలు | పైసలు | నయా పైసలు | అణాలు | పైసలు | నయా పైసలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 0 | 3 | 2 | 4 | 3 | 27 | 8 | 3 | 52 | 12 | 3 | 77 |
| 0 | 6 | 3 | 4 | 6 | 28 | 8 | 6 | 53 | 12 | 6 | 78 |
| 0 | 9 | 5 | 4 | 9 | 30 | 8 | 9 | 55 | 12 | 9 | 80 |
| 1 | 0 | 6 | 5 | 0 | 31 | 9 | 0 | 56 | 13 | 0 | 81 |
| 1 | 3 | 8 | 5 | 3 | 33 | 9 | 3 | 58 | 13 | 3 | 83 |
| 1 | 6 | 9 | 5 | 6 | 34 | 9 | 6 | 59 | 13 | 6 | 84 |
| 1 | 9 | 11 | 5 | 9 | 36 | 9 | 9 | 61 | 13 | 9 | 86 |
| 2 | 0 | 12 | 6 | 0 | 37 | 10 | 0 | 62 | 14 | 0 | 87 |
| 2 | 3 | 14 | 6 | 3 | 39 | 10 | 3 | 64 | 14 | 3 | 89 |
| 2 | 6 | 16 | 6 | 6 | 41 | 10 | 6 | 66 | 14 | 6 | 91 |
| 2 | 9 | 17 | 6 | 9 | 42 | 10 | 9 | 67 | 14 | 9 | 92 |
| 3 | 0 | 19 | 7 | 0 | 44 | 11 | 0 | 69 | 15 | 0 | 94 |
| 3 | 3 | 20 | 7 | 3 | 45 | 11 | 3 | 70 | 15 | 3 | 95 |
| 3 | 6 | 22 | 7 | 6 | 47 | 11 | 6 | 72 | 15 | 6 | 97 |
| 3 | 9 | 23 | 7 | 9 | 48 | 11 | 9 | 73 | 15 | 9 | 98 |
| 4 | 0 | 25 | 8 | 0 | 50 | 12 | 0 | 75 | 16 | 0 | 100 |

**అది మీరు వుంచుకొనండి -**
**అది మీకు కావలసి వస్తుంది.**

# శ్రీరామకర్ణామృతము

( ఆంధ్రానువాదము )

శ్రీ కల్లూరి అహోబలరావు.



(గతసంచిక తరువాయి)

ఆ॥

భూమిజాత విభుఁడు-భూరిమందారమై
యతనికరము సీత నాశ్రయించి
కొమ్మయై వెలుఁగఁ గొప్ప వేదాంత, వి
జ్ఞాన సుమములందు జననమొందె

ఆ॥ (a)

మంచి పరిమళంబునించె నా పుష్పంబు
లందుఁ బ్రభవమొందె యమృతరసము
లూటగారునట్టి మేటి బ్రహ్మానంద
మనెడి ఫలము దాని ననుభవింతు.

కం॥

బంగారు కాంతిఁ గల్గిన
రంగారెడు మేనుఁగల్గి రాణించెనుగా
శృంగారంబుగ జానకి
భృంగంబులు మోముదమ్మి వెసఁ
గ్రమ్మంగన్.

కం॥ (a)

భృంగములకు భయపడి, యా
లింగన మొనరించె సీతలీలాలోలున్
శృంగార పురుషు రామునిఁ
బెంగటఁదా మెఱపు కరణిఁ జెలువు
వహించెన్

కం॥ (b)

క్రొత్త మెఱపుతోడఁ గూడిన మేఘంబు
విధము – రామచంద్ర విభుఁడు, సీత
తన్నుఁ గౌగిలింపఁ దనరారుచుండె ; నా
తండు బాపు నాదు తాపములను

సీ॥

శాస్త్రపాఠంబు లేల ? విచారమేల ?
వేదపఠనంబు లేలొకో ? వాదు లేల ?
జప తపంబులు వ్రతములు సల్పు టేల ?
యాగ, ముపవాసములు, తీర్థయాత్ర లేల ?
రామనామ మాహాత్మ్యంబు రక్తిఁగల్గు
మానవుల కేల డంబంబు ? మరణ భయము
లేదు, పాపభీతియు లేదు లేశమేని
రాము గుణధాము సేవించు ప్రజలకెపుడు.

ఉం

మానస సరోవరంబు, రమావధూటి
చిత్తమందలి విహరించు- మత్తరాజ
హంసవైనయో శ్రీరామ! యహరహంబు
బాధలోనగూర్చు, సంసార బహుళ కష్ట
తతులఁబోనాడి, నాకు శాంతం బొసంగి
రక్ష నొసఁగుము ; తారక బ్రహ్మరామ !

రాక్షసధ్వంస! శ్రీరామ! రామభద్ర!
నా నమస్సులఁ గొనుము ; శ్రీ నాథ!
వరద!

౬౧

సాకేత పురమందు, సరయూనదీతర
  సైకతంబులయందు, సంతతంబుఁ
గూర్చుండి శ్రీరామ! కొమరొప్పు నీ నామ
  చింతన మదిలోనఁ జేయునట్టి
శుభదివసంబు వచ్చునే? యెన్నటికి నేని
  శ్రీరామ! సీతాపతీ! రమా వి
భుండ! మనోహరా! పొలుపారు, రాకాశ
  శాంక మూర్తి ముకుంద! సాధుచరిత!
రామ! రక్షింపు! రక్షింపు! రామచంద్ర!
యంచు, మొఱయిడుచుండంగ, నబ్దతతులు
నెలలు, దినములు, గంటలై, నిమిష
  ములుగఁ
గడచుచున్నదో? యని నేను కలవరింతు.

౬౨

తులసితోట, యయోధ్యలో వెలయు ;
  నచట
నూర్ధ్వ తిలకంబు ధరియించియున్న వాఁడు
రాక్షసధ్వంసి, జానకీరాముఁ డతని
యహరహంబుఁ బ్రార్థింపగా నబ్దతతులు
నెలలు, దినములు, గంటలై, నిమిషము
  లుగఁ
గడచుచున్నదో? యని నేను కలవరింతు.

౬౩

రత్నసింహాసనమునందు - రామచంద్ర!
కూరుచున్నావయోధ్యలోఁ గూర్మితోడ
సీత, యాలింగన మొనర్చె ; శివధనుస్సు
విఱిచినాఁడవు ; రఘుపతీ! వేడ్కతోడ
నిన్నుఁ బ్రార్థింప నబ్దముల్, నెలలు, దినము
లగుచు, గంటలై -నిమిషంబులగుట యెన్న
డంచుఁ గలవరింతును నేను, హరి!
  ముకుంద!

౬౪

రత్నంపు వేదికల్ - రాజిల్లుచుండును
  తెరువులలో, ప్రతి తరువుక్రింద -
ప్రతి వేది కోపరిభాగంబునందును
  చెలువారుఁ గిన్నర స్త్రీల పాట
ప్రతిపాటలోపలఁ బ్రతిబింబమైయుండు
  మంజులాలాపంపు మధురగోష్ఠి
ప్రతిగోష్ఠియందు - శ్రీరామ! నీ కథ యుండు
  కథయందు నమృతంబు గ్రాలుచుండు
నమృతధారఁ గ్రోలునట్టి భక్తులకెందు
జరయు, మృతియు లేదు ; సంతతంబు
నీ కథామృతమ్ము నాకిమ్ము శ్రీరామ!
వందనములసేతు సుందరాంగ!

౬౫

ప్రతితరువునందుఁ గన్పడుఁ బక్షిమూక
పక్షిమూకలు మృదువైన పలుకులొసఁగుఁ
బలుకుఁ బలుకున, మంజులపదములుండు
ప్రతిపదమునందుఁ జెలఁగు శ్రీరామకథలు.

౬౬

శ్వేత పుష్పకమెక్కి, భూజాతఁగూడి
యాంజనేయ, విభీషణుఁడాది భక్త
వరులు నీ సేవఁ జేయంగ వఱలినావు;
నా మనస్సున విహరింపు రామచంద్ర!

౬౭

ఖడ్గ, త్రిశూల ముద్గరముల ధరియించి
డమరుకము, గదయు, డాలుగల్గి
శంఖంబు, పాశంబు, చక్రంబు, ముసలంబు
ధరియించి, నాగలికరముబూని
చిన్నకత్తియు, విల్లుఁ జేతిలో ధరియించి
బాణంబు, గొడ్డలి పరగఁదాల్చి
భిండివాలంబగ్ని, పిడికిలి బిగఁబట్టి
యభయంబు భక్తుల కరయనొసఁగి
తెల్లరంగుఁగల్గి, దేదీప్యమానమౌ
మూడు నేత్రములతో వేడిఁజూపి
సర్వ శత్రువులను, సంహరించెడి, భీక
ర స్వరూప! రామ! ప్రణతులవిగో!

౬౮

పాపాంధకారంబు బాపు చంద్రుండవు,
దుష్టపద్మంబుల తోషమెల్లఁ
బాపు చంద్రుండవు; వరసురకువలయ
ములకుఁ జంద్రుండవు; ముదుగాగ
సూర్యవంశ సముద్రశోభ, పెంపొందంగఁ
జేయు, చంద్రుండవు; స్వీయమైన
ప్రజకనురక్తుఁడౌ - రాగ చంద్రుండవు
శత్రు పద్మంబుల సౌరుఁబాపు
చందురుండవు; నీ సేవ సలుపు, భక్త
లగు, కుముదముల చంద్రుండ వగణితముగ;
రామచంద్రుండ! శ్రీ సార్వభౌమ! నీకుఁ
బ్రణతు లొసఁగెద; రక్షింపు భద్రచరిత!

౬౯

కౌశిక యజ్ఞంబుగాచిన దక్షుండు
శుభముల నొసఁగెడి యభయమూర్తి
కనక పర్వతధైర్య గరిమఁగల్గినవాఁడు
కరుణా సముద్రుఁడై - ప్రాలువాఁడు
కంజాత నేత్రుండు - కాకుత్స్థ రాముండు
సీతా సమేతుండు, చిన్మయుండు
కష్టముల్ బోకార్చి-యిష్టంబు లొనగూర్చు
మానసదైవంబు మాధవుండు
చిత్తమందు సతము జెలఁగుచుండెడివాఁడు
శాంతి నొసఁగునట్టి శాంతమూర్తి;
రామచంద్ర విభుఁడు రక్షించుగావుత!
సతని కేదినంబు నతులొనర్తు.

౭౦

రామాయణంబు, క్షీరసముద్రమాయె; వా
ల్మీకి - మందరమాయె; మీననేత్ర
జానకి లక్ష్మియై - జనియించె; సుగ్రీవ
జాంబవాంగదులందు జననమైరి
కల్పవృక్షములుగా; కమనీయ చంద్రుఁడై
లక్ష్మణుండు జనించె లక్షణముగ
అమల విభీషణుం డమృత భాండంబుగా
నుద్భవమయ్యెనా యుదధియందు;
పవన సుతుఁడు, చింతామణి ప్రభలవెలిగె;
రావణుఁడు, గాలకూటమై రహిజనింప
నతనిఁ జెండాడి శ్రీరామ! యశము గాంచి
వయ్య! శుభముల మాకిమ్ము నెయ్య

మలర.

(సశేషము)

(624–వ పేజి తరువాయి)

దుండును. మంచి గాలియు, సూర్యరశ్మియు సోకుచుండుటచే శరీరమునకును, ఇంద్రియములకును ఎంతో మేలుకలుగును. క్రీడించునెడ నెన్నో విధములగు దేహచలనము లవసరమగును. అందుచే బిడ్డలకు వారి కండరములపై స్వాధీనతహెచ్చి నేర్పుతో గూడిన పనులెన్నో యలవడును. కఱ్ఱఘనములతో నాడుట, మెకేనాతో (Meccanc) నాడుట, కుట్టుట, కత్తిరించుట, కోయుట, రంగులువేయుట, బొమ్మలనుగీయుట ఇత్యాది పనులచే, చేతినిపుణత పెంపొందును. దేహాభివృద్ధికి క్రీడ యెంతో ముఖ్యమని గ్రహించిన దేశములలో డ్రిల్లునకును, దేహాభ్యాసమునకును బదులు బిడ్డలచే నన్నిరకముల యాటల నాడించుటయే జరుగుచున్నది.

బిడ్డలు క్రీడించునపుడు తమ పరిసరములందలి వస్తువులకుగల గుణోపయోగములను బాగుగ దెలిసికొనుచు మానసికముగగూడ నెంతోయభివృద్ధి నొందుచున్నారు. క్రీడను సలుపునపుడు తామొనరించెడి తప్పులను దెలిసికొని వారెంతో జ్ఞానము నొందుచున్నారు. తమ కిష్టమగు నాటల నెన్నింటినో సరిగా దెలిసికొనుటకై వారు పుస్తకముల జదువుటయు, పెద్దల నడుగుటయు, జరుగుచుండును. అట్లగుటచే వారెన్నో క్రొత్త విషయములను నేర్చుకొనుట కవకాశము గలుగుచుండును. ( ఒకప్పుడు కొందరు పిల్లలకు "కొఱ్ఱోబోరీ" (Corroboree) యనెడి వింతయాటపై కోరిక పుట్టెను. దాని నాడుటకై వారాదిమవాసుల యాచారముల దెలిసికొనుట యవసరమయ్యెను. వారా విషయములను దెలిసికొనుటకు తల్లిదండ్రుల నడిగిరి. పుస్తక భాండాగారములకును, వస్తుప్రదర్శనశాలలకును బోయిరి. ఆదిమవాసుల యాయుధములను పాత్రలనుజేయ ప్రయత్నించిరి. ఆ యాటకు గావలసిన నృత్యగీతములను తామే స్వయముగ నేర్చుకొనిరి. తమ ప్రదర్శనమును సందర్శింప పెద్దల బిలచిరి. వారి ప్రదర్శనము పెద్దల కెంతో విచిత్రముగదోచెను. కాని బాగుగ నాలోచించిన వారందరు కూడి యాడిన ఆ యాటలో ఊహాశక్తి, కావలసిన వాని నెంచుకొని సేకరింపగలుగుట, చొరవ, ఏకాగ్రత, లక్ష్యమును మరువకుండుట, జ్ఞానసంపాదన అనెడి విషయములెన్నో ఇమిడియున్నవి. మరియు ఆటకు గావలసిన వస్తుసామాగ్రులనెల్ల, వారే తయారుచేయుటచే నేర్పుతో కూడిన పనులెన్నో వారి కలవడెను.

ఆటలలో పాల్గొనునపుడు బిడ్డలకు సాంఘికముగ సర్దుకొని మెలగుట (Social adjustment) అలవాటగును. పైజెప్పినయాటయందు పాల్గొనిన పిల్లలందరును అన్యోన్యసహకారమును జూపుచు అత్యుత్సాహముతో తమపనులను జేయగలిగిరి. తమయాటను విజయవంతముగ కొనసాగింపవలెననెడి కోరిక ప్రబలమై వారందరును కలసి పనిచేయగలిగిరి.

రెండు, మూడేండ్ల బిడ్డలు తమవయస్సు బిడ్డలతో కలసియుండుటకే మొదట ప్రయత్నింతురు. సంతృప్తికరమగు సాంఘిక జీవనమునకీ ప్రయత్నమే మొదటి మెట్టు. ఎదిగిన కొలదియు బిడ్డలింకను యెన్నోరీతుల సాంఘికాభివృద్ధిని జూపుచుందురు. తమ వయస్సునకు తగిన యాటలనాడునపుడు వారితరులతో సహకరించుట, ఇతరుల హక్కులను పాటించుట, ఓర్పువహించుట, సాంఘికావసరములని బాగుగ గ్రహింతురు. కిండర్‌గార్డెన్, నర్సరీబడుల యందీయవసరములకు తగిన యేర్పాట్లను జేయుచునే యున్నారు. కాని బిడ్డలెదిగినంతనే నిర్మాణ క్రీడలకును (Constructive plays) నాటకపుటాటలకును (Dramatic plays) గలవిలువను మరచి ఏర్పాటైనయాటలకును (Organised games) వ్యాయామ క్రీడలకును మాత్రమే ఎక్కువ ప్రాధాన్యమునిచ్చుచున్నారు.

బిడ్డలు తమకుగల శక్తులను (abilities) సహజప్రవృత్తులను (natural tendencies), ప్రాథమికావసరములను (fundamental needs), భావోద్రేకావసరములను వ్యక్తములను (emotional needs), ఆటలయందు దెలుపునట్లు మరెందును వ్యక్తము జేయరు. వారిని సరిగా గ్రహింపవలెనన్న ఆటల సమయమున వారెట్లుండునదియు బాగుగా గమనింపవలెను. ఆ గమనించుట వారికి తెలియకుండ జరుగవలెను. అప్పుడే వారి మనస్తత్వము మనకు సుబోధకమగును.

(సశేషము)

# ఆంధ్రకవుల వ్యంగ్య వాగ్వైభవం



వాక్చమత్కృతి ఒక విశిష్టకళ. దేశం సుభిక్షమై, శాంతి సౌభాగ్యాలకు ఆలవాలంగా ఉన్నప్పుడే అది రసనిష్యందిగా, రమణీయం పెంపొంది రసికలోకానికి నిత్యస్మరణీయంగా ఉంటూ ఉంటుంది. విక్టోరియా రాణి చల్లని పరిపాలనలో ఆంగ్లసారస్వతప్రవంతి సువిశాలగంభీరమై రమణీయోన్నతాదర్శమై నర్మోక్తి విలసితమై ప్రవర్ధిల్లింది. కాని అప్పటికీ, ఇప్పటికీ కాలం చాలా మారింది. రెండు ప్రపంచయుద్ధాలలో జీవితాల తీరుతెన్నులుకూడా మారిపోయాయి. ఎవరు చూసినా, ఎక్కడచూసినా ఒకటే హడావిడి. ఏదో మునిగిపోతున్నట్లు తొందర, ఆ క్షణం దాటితే, యీవాళటికి రైలు అందదేమో అన్నట్లు, చెప్పులో కాళ్లుపెట్టుకొచ్చినట్లు, ఎక్కిన గుర్రాన్ని దిగితేనే ఎక్కడ వేళమించిపోతుందో అన్నట్టు శరవేగంతో దూసుకుపోతూ ఉండడంలో నర్మోక్తులకూ, మర్మోక్తులకూ తావెక్కడ? ఇలాంటి పరిస్థితులలో ఆంధ్ర సారస్వతంలో అనర్ఘ రత్నాలుగా భాసిల్లుతున్న కొన్ని నర్మ, మర్మగర్భితమై నిత్య నూతనంగా తరతరాల పాఠకులను అలరిస్తూ వచ్చిన హాస్యోక్తులను స్మరించుకోవడం సముచితం కాకపోదు.

ఆంధ్ర ప్రతిభకు అపూర్వమైన ఘనతను చేకూర్చి పెట్టినది తెలుగు వాఙ్మయనందనంలో హాస్యవల్లరిపూరితసురభిళ ప్రసూనాలు. అక్బరు పాదుషా దేవేంద్రవైభవంతో అఖండ భారత దేశాన్ని పరిపాలిస్తున్న స్వర్ణయుగంలో అచ్చ తెలుగు నాటి వాడైన జగన్నాథ పండితరాయలు తన సరస, చతురోక్తులతో పాదుషాను మెప్పించి ప్రపంచ మన్ననలనందినాడు. ఈయన స్వస్థలం తూర్పు గోదావరిజిల్లాలోని ముంగండ గ్రామం. గోదావరితీరం నుంచి తన్ను కేలూని యమునానది వరకూ నడిపించుకుంటూ వచ్చిన బలీయమైన ప్రేరణను వివరిస్తూ ఆయన "ఢిల్లీశ్వరోవా జగదీశ్వరోవా" అంటూ చెప్పిన శ్లోకాలు యీ కోవలో అణి ముత్యాలుచూడండి.

ఢిల్లీశ్వరోవా జగదీశ్వరోవా,
మనోరథాన్ పూరయితుం సమర్థః,
అన్యైః నృపాలైః పరిదీయమానః
శాకాయ వాస్యాల్లవణాయ వాస్యార్.

దీనికి తాత్పర్యం ఇది. నా మనోభీష్టాన్ని తీర్చ గలిగిన సమర్థులు యీ ప్రపంచంలో ఇద్దరే ఉన్నారు. ఒకరు ఢిల్లీశ్వరులు. రెండవవారు సాక్షాత్తు భగవంతుడైన జగదీశ్వరుడు. అంతకు తక్కువవాళ్లేవరైనాసరే ఎంత గొప్పదానమిచ్చినప్పటికీ అది కూరఖర్చుకుకూడా చాలదు. ఎంత గొప్ప ఆత్మ విశ్వాసం. ఇలాంటివే ఇంకొటిన్ని.

నహియాచే హిందూకం,
పర్వణి దత్తైక తామ్ర డబ్బూకం
యాచే మొగల్మలూకం
తృణీకృత స్వర్ణ చందూకం ...

ఏమంటాడంటే "పండుగ రోజుల్లో ముష్టివాళ్లకు మళ్లే రాగిడబ్బును యాచించడంకోసం నేను రాలేదు. నాకు కావలసినది మొగలు పాదుషా కోశాగారం. యాచనా దైన్యానికి దిగజారిపోవడంకంటే రాజ కోశాగారంలోని స్వర్ణరాశులను కొల్లగొట్టడమే నా అభిమతం" ఏమి ఠీవి? అపారమైన సంస్కృత వాఙ్మయాకాశంలో జగన్నాథ పండితరాయలు విరియ జాబిల్లి, పండిత మూర్ధన్యుడు. కసరాట్టు; వ్యంగ్య వైభవం, పదలాలిత్యం, రసపాకం-యీయన సొమ్ము. ఆజానుబాహువూ, దుర్నిరీక్ష్య తేజస్సంపన్నుడు జగన్నాథ పండితుడు. కడుపులో కాలుతున్నప్పటికీ, ఒకరిముందు మోకరిల్లి "దేహి," యని యాచించి ఎరుగని అభిమాన ధనుడు. కొంగలాయి

సార్వభౌముని శుద్ధాంత సుందరి యవనల వంగి రంభా సమాన కురంగీ దృగంగి, నవనీత కోమలాంగి, ఆమె ప్రణయాన్ని కోరి, కోరిక తీర్చుకున్న మొనగాడు. ఆ సందర్భంలో ఆయన చెప్పిన పద్యాలు అపార మధురాలు.

ఇయం సుస్తనీ మస్తకన్యస్త కుంభా కుసుంభా
రుణంచారుచేలం దధానా
సమస్తస్య లోకస్య చేతః ప్రవృత్తిం గృహీత్వా
ఘటీ స్థాప్య యాతీవ భాతీ.
నయా చే గళాళిం నవావాణి తాజిం నవిత్తేషు
చిత్తం మదీయం కదాచిత్
అతంభోపమానాపి రంభాసమానా లవంగీ
కురంగీ దృగంగీ కరోతు.

యవనీ నవనీత కోమలాంగీ,
శయనీయం యదినీయ తేకదాచిత్,
అవనీతల మేవ సాధుమన్యే
నవనీ మాఘవనీ వినోధ హేతు.
యవనీ రమణీ చపదః శమనీ
కమనీయ తమాన వనీత సమా
ఉహి ఊహి వచోమృత పూర్ణముఖీ
సమధీ జగతీహ యదంక గతా.

ఈ బహుముఖ ప్రజ్ఞాకాశాలి ఉపద్రష్ట పేరిభొట్లు గారికి అర్థాంగలక్ష్మి అయిన లక్ష్మీదేవి గర్భశుక్తి ముక్తాఫలం. మూడు తరాలవరకూ మొగలాయి దర్బారును యీ మహనీయుడు తన కవితా వచో మృత ధారతచేపునీతంచేసి, అసఫ్ విలాసం కావ్యాన్ని రచించి వన్నెకెక్కినవాడు. దారా శుకో, షాజ హానుల సభాభూషణమై తెలుగు ప్రతిభకు జయపతా కాల నెత్తినవాడు. వ్యంగ్యవైభవానికి కవిజన సహజ మైన నిర్భయ నిరంకుశత్వానికి జగన్నాధ పండిత రాయలు పెట్టినది పేరు. దుర్వృత్తులైన జారజన్ములు అపహరించుకుపోతారేమోననే భయంతో తన పద్య రత్నాలను మందాకాదలోదాచానని ఒక చోట చెప్పు కున్నారు. ఆ పద్యం యిది.

దుర్వృత్తా జార జన్మానో
హరివ్యంతీతి శంకయా
మదీయ పద్యరత్నానాల
మంబూదై కామయాకృతా.

తరువాత యీ మహామనీషి లవంగీ ద్వితీయుడై మాతృదేశానికి మరల వచ్చారనుకోండి. అది వేరే సంగతి. ఏమైనప్పటికీ, అనన్య ప్రతిభా సమన్విత మైన నర్మవాగ్వైభవానికి రాష్ట్రాంతరాలలో తెలుగు వాణికి అపార యశస్సును సముపార్జించి పెట్టిన వాడు జగన్నాధ పండితుడు.

తెలుగు భాషలో చతురోక్తుల సంగతి ప్రస్తావించి, జగన్నాధ పండితుని గాధను చెప్పడంలో, సంస్కృతానికి దక్కవలసిన కీర్తిలో కొంత తెలుగుభాష పాలు పంచుకుంటూందేమో అనిపించడం కద్దు. కాని నిజం అది కాదు. ఈ కోవకు చెందిన తెలుగు కవులు కావలసినంతమంది ఉన్నారు. వీరిలో ప్రధమ స్మరణీయుడు తెనాలి రామకృష్ణుడు, రామలింగ డన్నా యీయనే. అసలే ఉద్దండ పండితుడు. ఆపైన వికటకవి కూడాను. లోకేమిటో! అతని పేరు చెబితే కావలసినన్ని కట్టుకథలు. తామర తంపరగా ఊరిపోయాయి. ఎక్కడే కొంటె మాట వినపడ్డా, ఎక్కడ కాసిని నవ్వులు ఒలికినా అక్కడల్లా రామలింగనిస్మరణ. తెలుగు నాట యీనాటికీ తప్పడంలేదు. పుట్టగానే తమపిల్లలకు రామలింగని హాస్యకథలను ఉగ్గుతో రంగరించి తెలుగుతల్లులు పెట్టుతారంటే అందులో ఆశ్చర్యంలేదు. ఈ నవ్వుల గనిలో అడుగడుక్కీ దొరికే అనర్ఘ రత్నాలను ఏరు కొని ఆనందించేవారు. అక్షరాస్యులు మాత్రమే కారు. నిరక్షర కుక్షులైనప్పటికీ, నలుగురు తెలుగువారు చేరిన చోటల్లా తెనాలి రాముని మాటలలో నవ్వుల దొంతరలు వెల్లివిరిసి పోతూనేవుంటాయి. చూడండి, ఒకనాడేమో ఒక విద్యార్థి తన గురువుగారికి వయ్యాకరణ ప్రతిభను ఆకాశానికి ఎత్తివేస్తూ -

అపశబ్ద భయం నాస్తి అప్పలాచార్య సన్నిధౌ
అన్నాడట. ఇదివినేసరికి రామకృష్ణుడు
అసాచార భయం నాస్తి తిరువెంగళనాథస్య
సన్నిధౌ

అని పూరించాడట. అర్థం తెలిసిన రసికులకు ఇదెంత ఘాటు విమర్శో వేరే వివరించనక్కరలేదు.

అప్పయ్యదీక్షితులవారు గొప్ప పండితులు. ఆయనకు ముందు తాతాచార్యులవారు అగ్రశ్రేణికి చెందిన విద్యాధికారులు. ఈమాటనే ఒక దీక్షిత భక్తుడు ఇలా అన్నాడు.

అప్పయ్య దీక్షితాత్పూర్వం ప్రాతఃపూజ్యన
సంశయః
ఇది వినగానే కొంటె రామకృష్ణుడు ఛలోక్తి
విసిరినట్లుగా...
ముఖ ప్రక్షాళనాత్ పూర్వం పద ప్రక్షాళనం
యథా

అని మాడ్చివేశాడు. ఈ తాతాచార్యులవారు గొప్పపండితులు. 16 వ శతాబ్దములో చంద్రగిరిని పాలించిన వెంకటపతిరాయలకు గురుపాదులు కూడా. ఈయనకూ, రామకృష్ణునకూ ఎప్పుడూ తాతా మనవల వరస. వీరిద్దరికీ సంబంధించిన కథలు లెఖ్ఖలేనన్ని అనుశ్రుతంగా పరంపరగా ప్రచారం లోకి వస్తూనే ఉన్నాయి. ఈ మహాకవి కృష్ణ దేవరాయల భువన విజయంలోని అష్టదిగ్గజాలలో ఒకరు. కవిరాభోజుడైన రాయలు స్వయముగా మహాకవి. ఆయనకు ధూర్జటి అన్న అభిమానము మెండు. ప్రతిరోజూ ధూర్జటిని ప్రశంసిస్తూ, సదస్యులైన కవి పుంగవుల ముందు ఒక సమస్యను విసిరేవాడు. ఒక రోజున ఎప్పటిలాగే,

స్తుత మతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల
కేలకల్గె నీ
యతులిత మాధురీ మహిమ. ...

అని రాయలవారు ధూర్జటి స్తవాన్ని ముగించీ, ముగించేలోగానే తెనాలి రామకృష్ణుడు లేచి నిలబడి



కుమారి రెంటాల సూర్యకుమారి
గానకళా ప్రావీణ్యమునకు శ్రీమతి బెంగుళూరు నాగరత్నమ్మగారి స్వర్ణపతకమును వరుసగా యీ సంవత్సరమును బడసిన కేసరి హైస్కూలు విద్యార్థిని.

---

'హా తెలిసెన్' అని ఒక్క కేక వేసేసరికి ఏమిటి! ఏమిటంటూ సభలో అందరూ ఆయనకేసి తిరిగి చెవులప్పగించి చూస్తూ ఉంటే, ధూర్జటి కవి గుట్టును బట్టబయలు చేసి బ్రతుకు బండారం ఇంతటిది సుమా అని చెప్పి నవ్వులపాలుచేశాడు. ఫలితం పాఠకులే ఊహించుకోవచ్చును.

హా తెలిసెన్ భువనైక మోహనో
ద్ధత సుకుమార వారవనితా జనతా ఘన
తాపహారి, సం
తత మధురాధరోదిత సుధారస ధారల
గ్రోలుటం జుమీ.

సభలో అందరూ గొల్లున నవ్వుతూ ఉండగా ధూర్జటి చల్లగా తలవంచుకున్నాడట.

(సశేషము)

# ఆంధ్రైక్యత

శ్రీ గుమ్మిడిదల వెంకట సుబ్బారావు

సర్కా-రాంధ్రులు |
రాయలసీమా |
తెలంగాణమూ |
మూడూకలసీ |
ఒకటేయంచును |
ఢంకామీదా |
దెబ్బకొట్టుచూ |
చాటర వెరువక |
ఆంధ్రుడవైతే ||
పృథ్విలో వెల్లను |
అగ్రగణ్యులగు |
త్యాగయగారూ |
కృష్ణరాయలూ |
రుద్రమదేవీ |
కోడిరాముడూ |
ఆంధ్రరత్నమూ |
అల్లూ రాతడు |
పొట్టిరాములూ |
అంతా ఒకటే |
ఆంధ్రుల మంచును |
ఎగిరిపాడరా- వెరువకనీవు |
గెంతిఆడరా-ఆంధ్రుడవైతే ||

---

## భక్త రామదాసు

వి. యస్. ఫిలిమ్స్‌వారి 'భక్తరామదాసు' చిత్రమును నిర్మాత దర్శకుడు శ్రీ వి. నాగయ్యగారు. సంవత్సరాది నాటికి విడుదల చేయుటకు ప్రయత్నిస్తున్నారు.

చిత్రనిర్మాణం చాల చురుకుగా సాగుతున్నది. త్వరలో తానీషాదర్బారు సెట్టు షూటింగ్ కానున్నది. అందులో శ్రీ వి. నాగయ్య, పసల సూర్యచంద్రరావు, సీర్ల బ్రహ్మయ్య, శ్రీమతి సూర్యకుమారిగారలు నటిస్తున్నారు.




## క్రొత్త పత్రికలు

'నారీలోకం' ప్రథమ సంచిక మా కార్యాలయమునకు చేరినది. సంపాదకురాలు శ్రీమతి కె. రంగమ్మ రెడ్డి. సంవత్సర చందా రు. 6.0 0 విడిప్రతి 0.8.0.

స్త్రీ జనాభ్యుదయ మాసపత్రికగా పేర్కొనబడిన యిది ప్రముఖుల ఆశీస్సులతోటి, మహిళాభ్యుదయమును ప్రోత్సహించు ఉత్తమ రచనలతోటి అభ్యుదయ పంథాలో నున్నది. మహిళా రంగంలో సేవ చేయుటానికి యిట్టి పత్రికలు ఎంతైనా అవసరము. కార్యాలయం బెజవాడ - 2.

♦ ♦ ♦

'భాగ్యనగర్' జాతీయ సచిత్రపక్షపత్రిక ప్రథమ సంచికను మేము స్వీకరించినాము. కార్యాలయం బందరు. సంవత్సరచందా రు. 3.0.0 విడిప్రతి 0-2-0.

ఇది సయితము ప్రముఖుల ఆశీస్సులతో ప్రారంభమయిన పత్రిక. కలకాలం జాతీయ శ్రేయస్సులను ప్రోత్సహిస్తూ 'భాగ్యనగర్' వర్ధిల్లాలని ఆశిస్తున్నాము. సంపాదకులు : శ్రీ గోవాడ నిరీక్షణరావుగారు.

♦ ♦ ♦

'గీతావాణి' గీతాజయంతి (జ్ఞానయోగ) సంచిక మా కార్యాలయమునకు చేరినది. వెల రు. 1-0-0. ఇందులో గీతోక్త జ్ఞానయోగమునకు సంబంధించిన అమూల్యమైన ప్రవచనములు కలవు.

గీతా ప్రచారమునకు నిర్విరామంగా కృషి సల్పుతున్న యీ పత్రిక మానవ జీవితమును తీర్చిదిద్దుటకు విశేషముగా తోడ్పడగలదని మా విశ్వాసము. సంపాదకులు : శ్రీ స్వామి రామకృష్ణానంద. ప్రాప్తి స్థానము శ్రీ గీతా సాహిత్యసేవాసమితి, ఆళ్లగడ్డ, కర్నూలుజిల్లా.

♦ ♦ ♦

**సుందర భారతయాత్ర (ద్వితీయభాగము) : శ్రీ బులుసు సూర్యప్రకాశశాస్త్రి గారు. ప్రకాశకులు : సాధనగ్రంథ మండలి, తెనాలి. వెల రు. 2-8-0.**

ఇందులో జగన్నాధ ఖండము, మధ్య భారతము, రామేశ్వర ఖండము, పరిశిష్ట ఖండము, నైనిటాల్, నేపాల్, డార్జిలింగ్, అస్సాం, షిల్లాంగ్, కచ్, సింహళము, అనుబంధ శీర్షికలతో అనేక యాత్రాస్థలములను గురించి, నిధి విశేషములను గురించి, చారిత్రక విశేషములను గురించి వివరించబడినది.

ఈ గ్రంథమును పఠించుటవలన యాత్రలపట్ల ఆసక్తిని మాత్రమే కాక చరిత్ర జ్ఞానము సయితము పెంపొంది యాత్రికులకు అనేక విషయములు తెలియుచున్నవి.

భారతావనిలోని పుణ్యక్షేత్రములను గురించి యీ పాటి సుదీర్ఘ వివరణతో ఆంధ్రమున వెలువడిన గ్రంథమిదియేయని చెప్పవలెను.

ఇందులోని బొమ్మలు, వివరణ ఆసక్తితోపాటు పాఠకుల నుత్సాహపరచునవిగా నున్నవి.

మొదటిభాగం వెల రు. 2-8-0. మొదటి, రెండు భాగములుకలసి రు. 4-0-0.

---

# సంపాదకీయములు

## సానుభూతి సంతాపములు

ఇండియా వైస్ ప్రసిడెంటు డాక్టర్ రాధాకృష్ణన్‌గారి సతీమణి శ్రీమతి శివకామమ్మగారి మృతి సందర్భమున మా సానుభూతి సంతాపములను డాక్టరు రాధాకృష్ణన్‌గారికి, బిడ్డలకు, అశేషబంధువర్గమునకు తెలుపుచున్నాము.

డాక్టర్ రాధాకృష్ణన్‌గారి కుటుంబము, మా పూజ్యబాబు కేసరిగారికి అత్యంత సన్నిహితమైనది. ఉభయకుటుంబాలు పరస్పర అభిమానమైత్రులతో అచిరకాలంగా మెలగుచుండినవి. పత్నీవియోగ సందర్భమున మా గృహలక్ష్మి డాక్టర్ రాధాకృష్ణన్‌గారిని ఓదార్చడం ప్రత్యేకవిధి.

శ్రీమతి శివకామమ్మగారు ఉత్తమ గృహిణి. భర్త కీర్తి ప్రతిష్టలను, అభ్యున్నతిని ప్రోత్సహించి, ఉన్నత శిఖరముల నందుకుంటున్న భర్తను, కుమారుడిని, కుమార్తెలను, అల్లుళ్లను, వారి సంతానమును కనులారగాంచి సంతృప్తి ఆనందముల చవిచూచిన యిల్లాలు. ఆమెకు పరమపదంలో సుస్థిరమైన ఆత్మశాంతిని ప్రసాదించాలని భగవంతుని ప్రార్థిస్తున్నాము.

## మద్రాసు నగరంలోని తెలుగు పాఠశాలలు

ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోనే మద్రాసు నగరంలో బాల బాలికలకు తెలుగులో విద్యా సౌకర్యాలు తృప్తికరంగా నుండేవి కావు. ముఖ్యంగా ప్రాథమిక విద్యాభ్యాసానికి పడరానిపాట్లు పడినరోజు లున్నవి. దాని ఫలితంగానే మైలాపూరు, త్యాగరాయనగరములలో కేసరి విద్యాలయములు, నుంగంబాకం, షెణాయ్‌నగర్‌లలో శ్రీ వెంకటేశ్వర విద్యాలయాలు, ట్రిప్లికేనులో తెలుగు మహాజన సమాజం నిర్వహిస్తున్న విద్యాలయము, విల్లివాకంలో నిర్వహించబడుతున్న తెలుగు పాఠశాల యింకా కొన్ని తెలుగు బాల బాలికలకు మాతృ భాషలో విద్యా వసతులకుగాను ఏర్పడినవి. కాని ఆంధ్ర రాష్ట్రం విడిపోయి, ఆంధ్ర ప్రభుత్వ కార్యాలయములు సయితం తర్లించబడటంతో యీ విద్యాలయాల నిర్వహణకు అనువగు విద్యార్థుల సంఖ్య యుండదేమో. మద్రాసు నగరంలోని తెలుగువారు రాష్ట్రేతరాంధ్రులైనా వారి బిడ్డలకు మాతృభాషలో విద్యావసతు లత్యవసరము కాబట్టి తెలుగులో విద్యావసతులున్న యీ విద్యాలయాలను ప్రత్యేకముగ వినియోగించుకొని పోషించుకోడం వారి విధ్యుక్త ధర్మము.

మునుపటిలాగ కాక నగరంలోని తెలుగువారు మరింత సన్నిహితంగా తమ సమస్యలను ఆసక్తితో, సమైక్యతతో పరిష్కరించుకోవాలి !

తమకు సమీపముననున్న పాఠశాలలోని తెలుగు విద్యావసతులను వినియోగించుకుంటూ విద్యాలయాల నిర్వహణకు, అభివృద్ధికి తెలుగువారు సహాయపడుతుండాలి.

---

## గమనిక

హైదరాబాద్, సికిందరాబాద్ నగరములలో మా గృహలక్ష్మి పత్రికల నమ్మటకు సోల్ డిస్ట్రిబ్యూటర్లుగా మెసర్స్ జె. సి. పింటో & కో, 113/1 సరోజినిదేవిరోడ్డు, సికిందరాబాదు; అబిడ్స్ రోడ్డు, హైదరాబాదువారిని నియమించినాము.

# శ్రీ దుర్ముఖినామ సం॥ర మార్గశిర, పుష్య మాసములు

| | | | |
|---|---|---|---|
| డిసెంబరు నెల 1956 సం॥ | 16 | ఆ | చతు 50.43 కృ 8.51 |
| | 17 | సో | ○ పౌ 46.56 రో 7.30 దత్తాత్రేయ జయంతి |
| | 18 | మం | బపా 42.10 మృ 5.7 |
| | 19 | బు | విది 36.38 ఆర్ద్రా 1.49 పున 56.8 త్యా 3-44 బలరామజయంతి |
| | 20 | గు | తది 30-46 పుష్య 53.25 త్యా 3.42 |
| | 21 | శు | చవి 24.16 ఆశ్రే 48-44 త్యా 3.42 |
| | 22 | శ | పం 17.59 మఖ 44.13 త్యా 3.42 తిథిద్వయం |
| | 23 | ఆ | ష 11.57 పూఫ 40 6 |
| | 24 | సో | స 6.26 ఉఫ 36-29 కాలభైరవాష్టమి |
| | 25 | మం | అ 1 39 ఏవ్యం 55 57 హ 34.3 |
| | 26 | బు | ద 54.52 చి 72 30 |
| | 27 | గు | ఏ 53.27 స్వా 32-7 త్యా 4.4 |
| | 28 | శు | ద్వా 53.16 విశా 32.56 |
| | 29 | శ | త్ర 54-20 అనూ 34.58 త్యా 4-13 |
| | 30 | ఆ | చతు 56 34 జ్యే 38.9 త్యా 4.13 మాసశివరాత్రి |
| | 31 | సో | ● అమా 59.48 మూ 42-19 త్యా 4.17 అమా సోమవారవ్రతం |
| | | | **పుష్య మాసము** |
| జనవరి నెల 1957 సం॥ | 1 | మం | శుపా 60.10 పూషా 43.20 త్యా 4.20 |
| | 2 | బు | పా 4.1 ఉషా 52.58 త్యా 4.23 |
| | 3 | గు | విది 8.38 శ్ర 58-27 త్యా 4.24 |
| | 4 | శు | తది 13.29 ధని 60.10 త్యా 4-25 |
| | 5 | శ | చవి 18.20 ధని 4-58 త్యా 4.24 శూన్యతిథి |
| | 6 | ఆ | పం 22.55 శత 10.45 త్యా 4.22 పంచమితిధి |
| | 7 | సో | ష 26 56 పూభా 16-3 కుమారషష్టి |
| | 8 | మం | స 30.10 ఉభా 20 38 |
| | 9 | బు | అ 32.24 రే 24.16 త్యాజ్యాభావః |
| | 10 | గు | న 33-28 అశ్వని 26.51 |
| | 11 | శు | ద 33.17 భ 28.14 త్యా 4.1 |
| | 12 | శ | ఏ 31-49 కృ 28.22 వైకుంఠఏకాదశి |
| | 13 | ఆ | ద్వా 9.7 రో 27.18 త్యా 3.56 రా 12.43 త్యా 3.5 భోగ్యుత్సవము |
| | 14 | సో | త్ర 25-20 మృ 25-11 త్యా 3-48 ఉత్తరాయణ పుణ్యకాలం, సంక్రాంతి |
| | 15 | మం | చతు 20-31 ఆర్ద్రా 22-1 పశువులపండుగ |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.




## సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-8-0. అర్ధసంవత్సరపు చందా రు. 2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడి కాపి ఆరు అణాలు. చందాదారులు ఏ మాసము నుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంధికము గాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితలకట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను.

రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

## చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.